## అంద:

‘శ్రీవాణి’ ని ప్రశంసిస్తూ అనేకమంది పెద్దలు, సుప్రసిద్ధ రచయితలు, శ్రేయోభిలాషులు అనేక లేఖలు వ్రాస్తున్నారు. వ్యాపార పత్రికలు మూడు పువ్వులు, ఆరు కాయలుగా విజృంభిస్తున్న సమయంలో, సెక్సు సాహిత్యం పరవళ్ళు త్రొక్కుతున్న తరుణంలో, సాంస్కృతిక పత్రికను నడుప ప్రయత్నించడం గొప్ప సాహసమేనని కొందరు హెచ్చరిస్తూ, అభినందిస్తూ లేఖలు వ్రాస్తున్నారు. వారందరికి నా కృతజ్ఞతలు.

ప్రస్తుత వాతావరణంలో సాహిత్య, సాంస్కృతిక మాస పత్రికను నడపడం కష్టమేనని తెలిసికూడా ఈ సవాలును స్వీకరించాను. అర్ధనగ్న దృశ్యాల పత్రికలకు, సెక్సు నవలా సాహిత్య పత్రికలకు ఉన్న మార్కెట్ ‘శ్రీవాణి’ లాంటి ఉత్తమ భావాలు ప్రచారం చేసే పత్రి



కలకు లేదు. సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక పత్రికలు చదివేవారి సంఖ్య పరిమితం. అందులో కొని చదివే వారి సంఖ్య బహు స్వల్పం. ఈ విధంగా వ్రాస్తున్నందుకు మన్నించండి.

కవరు పేజీ ఆకర్షణీయంగా లేనియెడల పత్రిక మార్కెట్టుకు ఎక్కడం కష్టం. చాలామంది పై డాబుసరినే చూస్తున్నారుగాని లోపల సరుకును చూడటంలేదు. అందువలన ప్రారంభ సంచిక కన్నా రెండవ సంచిక, దాని కన్నా మూడవ సంచిక కవరు పేజీని ఆకర్షణీయంగా తీసుకుని వచ్చాను. ఒక్కొక్క కవరుకు 50 పైసలు ఖర్చుతో సాంస్కృతిక పత్రికను నడపడం చాలా కష్టమే.

ఈ కాలంలో సామాన్య, మధ్యతరగతి మేధావులు చదవడానికి మంచి ఉన్నత భావాలను ప్రచారం చేసే పత్రికలు తెలుగులో బహు తక్కువ. అందువలన ఈ సాహసం చేసాను. దీనిని వెలుగు లోనికి తీసుకొని రావడం నా ఒక్కడి వలన అయ్యే పనికాదు. రచయితలు సహకరించాలి. సాహిత్యాభిమానులు ఆదరించాలి. అప్పుడే పదికాలాల పాటు ‘శ్రీవాణి’ బ్రతికి బట్ట కట్ట గలుగుతుంది.

ఈ పరిస్థితిని సాహిత్యాభిమానులు సహృదయంతో, సదవగాహన చేసుకొని ‘శ్రీవాణి’ ని వెలుగులోనికి తీసుకొని రావడానికి అవసరమైన సహకారమును అందిస్తారని ఆశిస్తున్నాను. ఇటువంటి పత్రిక కావాలని ఆకాంక్షించే వారందరూ తమ బంధువులను, మిత్రులను సంవత్సర చందాదారులుగ చేర్పించుతారని విశ్వశిస్తున్నాను. అనేకమంది సహృదయులు. ‘శ్రీవాణి’ అభివృద్ధి చెందాలనే ఆకాంక్షతో అనేక సూచనలు చేస్తున్నారు. వాటిని దృష్టిలో పెట్టుకొని ‘శ్రీవాణి’ ని సమగ్ర విజ్ఞానవాణిగా రూపొందించడానికి నా శాయశక్తులా కృషి చేసానని మనవి చేసుకున్నాను.

ధన్యవాదములు

కొమరగిరి కృష్ణమోహనరావు

## పోస్టల్ మిత్రులారా!

ప్రజలకు తమరు చేస్తున్న కృషి ప్రశంసనీయం. ‘శ్రీవాణి’ పత్రిక అందడం లేదని చాలామంది ఫిర్యాదులు చేస్తున్నారు. మేము మాత్రం చందాదారులందరికి Post లో వేస్తున్నాము. ఎక్కడ పోతున్నాయో అర్థం కావడం లేదు. చందా చెల్లించిన వారికి పత్రిక అందకపోతే వారు ఏవిధంగా బాధపడుతారో సహృదయంతో ఆలోచించండి. చిరునామాలు సరిగా లేకపోతే త్రిప్పి మా కార్యాలయానికి పంపించండి. పత్రిక చదివిన తరువాత నయినా సరే చిరునామాదారులకు అందజేయండి. ఒకరి మీద అపనింద వేయడం మా లక్ష్యం కాదు. సహృదయంతో, సహకరిస్తారనే విశ్వాసంతో మనవి చేస్తున్నాము.

ధన్యవాదములు.

# త్రివేణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

ఏప్రిల్ - 1985

సంపుటి 1

సంచిక 4



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2 8 1 8



చందా వివరాలు

విడిప్రతి : రు. 2-50

సంవత్సర చందా : రు. 27-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS MACHILIPATNAM

on behalf of

Triveni Publishers Pvt. Ltd. Machilipatnam


## విషయసూచిక



ఇంకా కవితలు, కార్టూన్‌లు, అభిప్రాయవేదిక ........

# అమృతవాణి

మాచిభొట్ల చంద్రశేఖరశర్మ

శ్లో॥ కామాన్ దుగ్ధే విప్రకర్షత్య లక్ష్మీం
కీర్తిం సూతే దుష్కృతిం యా హినస్తి
తాం చాప్యేతాం మాతరం మంగళానాం
ధేనుం ధీరాః సూనృతాం వాచమాహుః ॥

"నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది" అనే సామెత వినే వుంటారు. నోరంటే నోటి నుంచి వెలువడే మాటన్నమాట. ఇతరులకు బాధ కలిగించకుండా హృదయాన్ని అలరించేలాగున మాట్లాడేహితమైన వాక్కు కామధేనువులాంటిది . హితంగాను మితంగాను మాట్లాడే మాటకు విలువ యెక్కువ. అలాంటి వాక్కు కోరికలన్నింటినీ తీరుస్తుంది. దారిద్ర్యం ఏమైనా వుంటే దాన్ని తొలగించేస్తుంది. మంచి పేరూ ప్రతిష్ఠా పెంచుతుంది. పాపాలను నశింప జేస్తుంది. చెడును, చెడు తలంపును కూడా రానీయదు. సమస్త శుభాలు దీనివల్ల కలుగుతాయి. సర్వమంగళాలకు ఈ సూనృత వాక్కు పుట్టిల్లుగా భాసిస్తుంది. అలాంటి హితవాక్కును పండితులు కామధేనువని వర్ణించారు. ఈ విషయాన్ని ఈ శ్లోకంలో చెప్పినవాడు భవభూతి మహాకవి.

కడుపులో ఏముందో ఎవరికీ తెలీదు. కాని మాటతీరును బట్టి ఆవ్యక్తిమీద గౌరవంకలగటం సహజం. మనసులో మంచి భావన ఉన్నా మాట పరుషంగా వుంటే సంఘంలో విరోధు లెక్కువ యేర్పడతారు. కనుక మనసులో మంచి భావ మొకటి వుంటే చాలదు దాన్ని వ్యక్తం చేయటానికి నోటి వెంట వచ్చే మాట కూడా బాగుండాలి. లోన బయట కూడా శుచిత్వ మెలా ముఖ్యమో అల్లాగే యిది కూడా.

అందుకనే "సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ నబ్రూయాత్సత్య మప్రియం" అని అన్నారు. ఎల్లప్పుడు సత్యమే పలకాలి. అయితే ఆ సత్యం ప్రియమైనదిగా కూడా వుండాలి. సత్యమే అయినా ఒకప్పుడది యిష్ట మైనది కాకపోతే అసలు మాట్లాడటం మానేయాలట.

దీన్ని బట్టి వాక్పారుష్యం అహితమైన సత్యం పనికిరానిదనే నీతి తెలుపుతున్నది. వాక్పారుష్య మనేది "విషం కంటేను అగ్ని కంటేను కూడా తీవ్రమైనద"ని భారతం చెప్తున్నది.

ప్రియమేవాభిధాతవ్యం నిత్యం సత్సు ద్విషత్సుచ
శిఖీవ కేకా మధురా ప్రియవాక్కస్య నప్రియః ?

ఎప్పుడూ మంచివారి విషయంలో గాని శత్రువుల విషయంలోగాని ప్రీతి పూర్వకమైన హిత వాక్కునే పలకాలి. కాని అహితంగా మాట్లాడటం మంచిది కాదు. నెమలి చూడండి ఎంత అందంగా కళ్ళకు ఆనందాన్ని కలిగిస్తుందో ! అలాగే ఆ నెమలి కూత కూడా ఎంత యింపుగా మధురంగా వుంటుందో చూడండి. నెమలన్నా నెమలి కూతన్నా అందరికీ యిష్టంగానే వుంటుంది. అలాగే చక్కగా మధురంగా హితంగా మాట్లాడే వ్యక్తి అంటే ఎవరికి మాత్రం యిష్టంకాదు ! ఆ మనిషి అందరికీ యిష్టుడే అని రామాయణ నీతి బోధిస్తోంది. కనుకనే గీతాశాస్త్రం కూడా వాఙ్మయ తపస్సంటే యేమిటో చెప్తూ ఈ విషయాన్ని చక్కగా వివరించింది క్రింది శ్లోకంలో.

అనుద్వేగకరం వాక్యంసత్యం ప్రియహితం చయత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయంతప ఉచ్యతే॥

ఇతరుల మనస్సుకు బాధ గలిగింపనిదియు, సత్యమైనదియు, ప్రియ మైనదియు, మేలు గలిగించునది యగు వాక్యమును, వేదాదుల యొక్క అధ్యయనమును అభ్యసించుట వాచిక (వాఙ్మయ) తపస్సని చెప్పబడుతున్నది. వాఙ్మయ తపస్సు అనగా వాక్కునకు సంబంధించినది. సత్యవాక్కుచేతను వాక్శుద్ధియు కలుగ గలదు. కనుక సత్యమైన మంచి మాటను చెప్పుట నేర్చుకొనవలెను. ★

# సంపాద

" Power corrupts and absolute power corrupts absolutely " లార్డ్ యాక్టన్ ఎంతో అనుభవంతో చెప్పారు. చరిత్ర చాటుతున్న నగ్న సత్యం కూడా యిదే. ఈ మధ్య జరిగిన లోకసభ, శాసనసభా ఎన్నికలలో కేంద్రంలో రాజీవ్‌గాంధీకి, మన రాష్ట్రంలో యన్. టి. ఆర్ కు అత్యధిక మెజారిటీ లభించింది. రెండు చోట్లా ప్రతిపక్షం నామ మాత్రంగానే వున్నది. మన రాష్ట్రంలో రెండు రకాల ప్రతి పక్షాలున్నాయి. 1. యన్. టి. ఆర్. హోరులో దెబ్బ తిన్న కాంగ్రెసు (ఐ) 2. యన్. టి. ఆర్. తో చేతులు కలిపి సీట్లను సంపాదించుకొనిన ప్రతి పక్షాలు (సి. పి. ఐ; సి. పి. యం; జనతా; భారతీయ జనతా )

ప్రజాస్వామ్యం నిజంగా వర్ధిల్లాలంటే, సఫలీకృతమై సాంఘిక న్యాయం చేకూరాలంటే బలమైన ప్రతిపక్షం వుండి తీరాలి. ప్రతిపక్షం పాత్ర ''watch dog'' లాంటిది. సరైన-ప్రతిపక్షం లేకపోతే ప్రభుత్వ పక్షానికి పట్ట పగ్గాలుండవు విమర్శించే వారే లేకపోతే, కండకావరంతో, కన్నూ మిన్నూ కానకుండా నియంతృత్వంగా వ్యవహరిస్తుంది ప్రభుత్వ పక్షం. ప్రతిపక్షం యొక్క అవశ్యకతను గుర్తించ కుండా, -ప్రతిపక్షాలను ఏదో విధంగా సర్వనాశనం చేయాలని, అధికార పక్షం భావించినా, ఓటరులు ప్రతిపక్షానికి సముచితమైన స్థానం యివ్వ కుండా; ఒకే పక్షానికి ' Brute Majority' యిచ్చినా ప్రజాస్వామ్య వ్యవస్థే అవస్థలో పడుతుంది. ఇప్పుడు మన దేశంలో అదే జరిగింది.

ప్రజాస్వామ్యమును గురించి ప్రముఖ అమెరికన్ విమర్శకుడు జేమ్సురస్సెల్ లావెల్ " మీరు అధికారంలో వుండదగ్గవారేనా ? అని అధికారంలో వున్నవారిని అడగడం ద్వారా ఇబ్బంది పెట్టే అలవాటు ప్రజాస్వామ్యానికి ఉంది" అని అంటాడు. కనుక ప్రజాస్వామ్యం మనగలగాలంటే ధైర్యంగా సద్విమర్శనలు చేసే ప్రతిపక్షములు వుండాలి. ఆ విమర్శనలను హుందాతనంగా ప్రభుత్వం స్వీకరించి పొరపాట్లను, తప్పులను సరిదిద్దుకోవాలి. అప్పుడే ఆ దేశంలో ప్రజాస్వామ్యం విజయవంతమవుతుంది. ప్రజలకు న్యాయం చేకూరుతుంది.

ప్రజాస్వామ్యంలో ప్రతిపక్షం పాత్ర ఉన్నతమైనది. విశిష్టమైనది. ప్రతిపక్షాలు దానిని కాపాడు కోవాలి. మన రాష్ట్రంలో అధికార పక్షమైన తెలుగుదేశంతో కొన్ని ప్రతిపక్షాలు ఎన్నికల సర్దుబాట్లు చేసుకొని, కొన్నిసీట్లను సంపాదించుకొని తమ అస్థిత్వాన్ని నిలబెట్టు కున్నాయి. అధికార పార్టీ సహకారంతో గెలిచాముగదా యని మొహమాట పడి, అధికార పార్టీని విమర్శించడానికి వెనుకాడుతే, ప్రజాస్వామ్యానికే తీరని హాని చేకూర్చిన వారవుతారు. ప్రతిపక్ష స్థానంలో వుండవలసిన అర్హతను, యోగ్యతను కోల్పోయిన వారవుతారు. కనుక జాతీయ ప్రతిపక్షాలు ఎట్టి అరమరికలూ లేకుండా, హుందాతనంగా, ధైర్యంగా, సద్విమర్శనలు చేస్తూ తమ అస్థిత్వాన్ని, నిజాయితీని నిలబెట్టు కోవాలి. అత్యధిక మెజారిటీ లభించినదనే ధీమాతో విమర్శలను లెక్క-చేయకుండా అధికారపక్షం ఏక పక్షంగా-వ్యవహరిస్తే తిరిగి ఏదో ఒక రోజున ప్రమాదాన్ని ఎదుర్కొనవలసి వస్తుంది. 'లార్డ్ యాక్టన్' అభిప్రాయాలు మరొక పర్యాయం ఋజువు చేసిన వారవుతారు

ఏప్రిల్ - 1985

# స్వాగత వాణి

రావయ్యా రావయ్యా వసంతా
సినీమన్మథుల మనో మాయాలోకంలోంచి
సచివ మలయానిలుని కళల దర్బారు కలలోంచి
వాణిజ్య చంద్రుని రాణివాసపు సాంద్రనీహారంలోంచి
కవీంద్రుని సర్వేంద్రియ మహోన్మాదం నుంచి

రావయ్యా రావయ్యా వసంతా
మొన్ననే ఎన్నబడిన నోరుగల గోరువంకల గోలల్లోంచి
హృదిలో చెలరేగిన సరదా కలకోకిల కూతల్లోంచి
నూనూగు మీసాల హాసాలు చిలికే యువద్విరేఫాల కోలాహలంలోంచి
క్రొంబసిడి జలతారు పైటల పాటలు పాడే రాచిలుకల పలుకుల్లోంచి

రావయ్యా రావయ్యా వసంతా
పూలహారాలలో వాగ్దానాలు రేపే పరిమళాల సాక్షిగా
విప్లవాల ఆవేశాలు గిలికే అక్షరాల వేదిక పరీక్షగా
మేధావుల ఆలోచనలు నిష్ఫలమవుతున్న కారణాల సమీక్షగా.

— మిరియాల రామకృష్ణ

# రామరాజ్యంలో ప్రజాస్వామ్యం

శ్రీరామచంద్రుడు ధర్మమూర్తి, ఆదర్శవీరుడు, ఆదర్శ ప్రభువు, ఆదర్శ పతి, ఆదర్శ సోదరుడు, ఆదర్శ మిత్రుడు, దీనజనోద్ధారకుడు, మాతాపితృ ఆచార్య భక్తుడు, వేదవేదాంగ తత్త్వజ్ఞుడు, శరణాగత రక్షకుడు, సత్యసంధుడు, రాజనీతికోవిదుడు, ప్రజానురంజకుడు, విశుద్ధమైన ప్రజాస్వామ్యవాది. అంతేకాదు గాంభీర్యమున సముద్రుడు. ధైర్యమున హిమవంతుడు. ఓర్పున భూదేవితో సాటైన వాడు. వీర్యమున విష్ణువునితో సమానుడు. చంద్రుని వలె చూచుటకు ప్రియమైన వాడు. త్యాగంలో దధీచితో సమానుడు. సత్యపరాక్రమ సంపన్నుడు. ఏకపత్నీవ్రతుడు. పితృవాక్య పరిపాలకుడు.

ఆ మహనీయుని చరిత్రను పఠించినచో మనస్సులలో గూడు కట్టుకొని యున్న కుటిలత్వం మటు మాయ మవుతుంది. ఈర్ష్యా ద్వేషాలకు తావే వుండదు. స్వార్థం సంకుచితత్వాలు శాశ్వతంగా సమాధి చేయబడుతాయి. ముఖ్యంగా నేటి పాలకులు ఆ మహనీయుని అనుసరిస్తే దేశంలో నెలకొనివున్న అశాంతి అరింతస్తుంది. సంక్షోభాలు చెలరేగనే చెలరేగవు.

## ప్రజాస్వామ్యవాది

శ్రీరామచంద్రుడు ప్రజాభిప్రాయానికి మిక్కిలి ప్రాముఖ్యతనిచ్చేవాడు. సామాన్య ప్రజల మనోభిప్రాయాలను ఎప్పటికప్పుడు తన గూఢచారి విభాగం ద్వారా తెల్సుకుంటూ, ధర్మపాలన కొనసాగించి ప్రజల మన్ననలను చూరగొనిన విశుద్ధమైన ప్రజాస్వామ్యవాది. మారుమూల గ్రామంలోని పూరిగుడిశ నుండి వినపడిన మాటలను వేగుల వారిద్వారా తెలిసికొని, నిండు చూలాలు అయిన తన సహధర్మచారిణి సీతాదేవిని నిర్దాక్షిణ్యంగా అరణ్యాలకు పంపిన ఆదర్శ చరిత్ర సంపన్నుడు.

శ్రీరామచంద్రుడు ప్రజాభిప్రాయానికి ఎంతటి విలువనిచ్చేవాడో ఈ ఒక్క ఉదంతం వలన అర్థం చేసుకొనవచ్చును. కొడుకులు_కోడళ్లు; కుమార్తెలు_అల్లుళ్లు; సోదరులు_భార్యల వలన నేటిపాలకులు అప్రదిష్టపాలవుతున్నప్పటికీ, వారి మీద చర్యలను గైకొనడానికి ఏ మాత్రం ముందుకు రాకపోగా, పైపెచ్చు వారి దుశ్చర్యలకు మద్దతునిస్తున్న నేటి సమాజానికి శ్రీరామచంద్రుని ఆదర్శం కనువిప్పు కాగలదనడంలో ఏ మాత్రం అతిశయోక్తిలేదు. ఈనాటి స్వార్థపూరిత వాతావరణంతో పోల్చుకుంటే రామరాజ్య వైశిష్ట్యం, శ్రీరాముని ఆదర్శం ఎంత ఉన్నతమైనదో మనకు బాగా బోధపడుతుంది.

కొమరగిరి కృష్ణమోహనరావు

## త్యాగధనుడు

"స్నేహం దయాంచ సౌఖ్యం చ, యదివా జానకీ మపి
ఆరాధనాయ లోకస్య, ముంచతో నాస్తిమే వ్యథా"

"లోకముయొక్క సేవ కొరకు స్నేహమును, దయను, సుఖమును ఒకవేళ జానకినైనను కూడా విడుచుటకు నాకు బాధలేదు" అని పలికిన శ్రీరాముని మాటలను అర్థం చేసుకుంటే శ్రీరాముని త్యాగం, గొప్పతనం, కర్తవ్య పాలనలో గల ఆయన దృఢ వైఖరి మనకు అవగత మవుతుంది. ప్రజాసేవే జీవిత పరమావధిగా భావించి, లోకకళ్యాణార్థం అవసరమైతే తన స్వజనులను, చివరికి తన అర్థాంగిని సహితం నవ్వుతూ త్యజించడానికి కూడా ఏ మాత్రం

సంకోచించనటువంటి దృఢ సంకల్పుడు. స్వార్థమే జీవితపరమావధిగా భావిస్తూ, సంకుచిత్వమే జీవితాశయంగా పెట్టుకుంటూ, బంధు పక్షపాతంతో, భార్యా పిల్లల మమకార బంధనాలలో చిక్కుకొని, సమాజ శ్రేయస్సును విస్మరించి, స్వ సుఖాలకోసం ఎంతటి నీచానికైనా వెరువ నటువంటి స్వార్థ పూరితమైన ప్రస్తుత సమాజానికి శ్రీరామ చంద్రుని ఆదర్శం ఒక్కటే శ్రీరామరక్ష కాగలదు.

## పితృవాక్య పరిపాలన

పితృవాక్య పరిపాలన పుత్రుల కర్తవ్యమని, అది అత్యంత పరమోత్కృష్టమైన ధర్మమని పదునాలుగు వత్సరాలు వనవాసం చేసి నిరూపించాడు శ్రీరామచంద్రుడు. ధర్మాచరణ అతని ప్రాణం. అరణ్యానికి బయలుదేరేటప్పుడు పుత్రవాత్సల్యాన్ని వదులుకోలేక తల్లి కౌసల్య విలపిస్తుంది. శ్రీరామునితో పాటు అరణ్యానికి వస్తానని పట్టుపడుతుంది. చివరికి చచ్చిపోతానని బెదరిస్తుంది. అయినప్పటికి శ్రీరామచంద్రుడు ఏమాత్రం చలించడు. తల్లిని ఓదార్చడానికి ప్రయత్నిస్తాడు. "తండ్రి వాగ్దానాన్ని నిలబెట్టడం పుత్రుని కర్తవ్యం. తండ్రి ఆశయం ప్రకారం అడవులకు వెళ్ళుతున్నాను. పతివ్రతయగు స్త్రీకి భర్త సేవ చేయడం కంటే వేరొక ధర్మం లేదు. కనుక దశరథుని సేవించడం సతిగా నీ కర్తవ్యం" అని ధర్మాన్ని సునిశితంగా నిష్కర్షగా వివరిస్తాడు. ఇదంతా వింటున్న దశరథుడు 'హా' అని కేకలు వేస్తూ, ఏడుస్తూ మూర్ఛిల్లుతాడు. రామ లక్ష్మణులు సపర్యలు చేయగా తెలివి వస్తుంది. అడవులకు వెళ్ళవద్దని బతిమాలుతాడు. సత్యసంధుడైన శ్రీరాముడు ససేమిరా అంగీకరించడు. "నాకు రాజ్యము పైన గాని, రాజ్య సుఖముల పైన గాని వ్యామోహం లేదు. మీ వాగ్దానం నిలబెట్టుటే నా పరమావధి. నా కోరిక ఒకటే. తమరు సత్యమును పాలించాలి. వాగ్దాన భంగం చేయరాదు. భరతుని పిలిపించండి. పట్టాభిషిక్తుని చేయండి. మనస్సును శాంతపరచుకోండి. దుఃఖించకండి. కంట తడి పెట్టకండి" అని శ్రీరామచంద్రుడు ఎంతో గాంభీర్యంగా

శ్రీవాణి

వినయ పూర్వకంగా విన్నవించుకుంటాడు. శ్రీరాముని లోని గొప్పతనం అదే.

## ఉదార చరిత్ర సంపన్నుడు

తనను అరణ్యానికి పంపడానికి కారణ భూతురాలైన పినతల్లి కైకేయి వైపు చూచి "అమ్మా ! అడవిలో వుండి శరీర పోషణ చేసుకొనే భారం మాత్రం నా మీద పెట్టావు. పాపం ! కుర్రవాడు భరతుని మీద మాత్రం సమస్త భువన పోషణ భారం మోపావు. మా ఇద్దరిలో ఎవరికి, ఎక్కువ సౌకర్యము కలుగ జేసావని విచారిస్తే, నీకు నా మొడలనే పక్షపాతం వున్నట్లుగ గోచరిస్తున్నది. తమ్ముడు మీద ఎక్కువ భారాన్ని మోపావు. నామీద నున్న బరువును తగ్గించావు." అని శ్రీరాముడు చిరునవ్వుతో అంటాడు. నవ్వుతూ, నవ్వుతూ, మృదు మధురమైన మాటలు చెబుతూ విషాన్ని సహితం సునాయాసంగా స్వీకరించ గల ఓర్పు, ఓర్మి గల ఉదార చరిత్ర సంపన్నుడు శ్రీరామచంద్రుడు. తనను ద్వేషించేవారిని సహితం ఆప్యాయతతో, ప్రేమతో మృదు మధురంగా పలుకరించగల విశాల స్వరూపుడు. శత్రువులను సహితం మిత్రులవలె ప్రేమించగల సహజ గుణ సంపన్నుడు. రాజ్యాన్ని చేబట్టడం కోసం జన్మనిచ్చిన తల్లి దండ్రులను, ఒకే రక్తం పంచుకొని పుట్టిన సోదరులను నిర్దాక్షిణ్యంగా హతమార్చిన ఉదంతాలు చరిత్ర పుటలలో అనేకం కనిపిస్తాయి. రాజ్యాధికారం కోసం మారణ హోమాలను సృష్టించిన సంఘటనలు అనేకం చరిత్రలో చూస్తాం. శ్రీరామునిలాంటి వ్యక్తిత్వం మాత్రం మరెక్కడా కనిపించదు.

## ధర్మ నిష్ఠాగరిష్ఠుడు

దశరథుని మరణానంతరం భరతుడు శ్రీరాముని కలువడానికి దండకారణ్యానికి వెళతాడు. అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యభారాన్ని వహించమని ప్రార్థిస్తాడు. కాని శ్రీరామచంద్రుడు అంగీకరించడు. చేసేది ఏమీ లేక భరతుడు ప్రాయోపవేశానికి పూనుకుంటాడు.




అప్పుడు శ్రీరాముడు భరతుని ఓదారుస్తూ " నాయనా ! ప్రాయోపవేశము బ్రాహ్మణ ధర్మము. రాజులకు అది నిషిద్ధం. ప్రాయోపవేశమును విరమించి, అయోధ్యకు పోయి తండ్రి యాజ్ఞానుసారము రాజ్యమును పాలింపుము. నేను తండ్రి ఆజ్ఞను శిరసావహించి యిక్కడి (అడవులకు) కి వచ్చాను. ఇది నా ధర్మం. తండ్రి ఆజ్ఞను మన్నించి రాజ్యపాలన చేయడం నీ ధర్మం " అని శ్రీరాముడు నచ్చ చెబుతాడు. శ్రీరాముని ఉదారత, ధర్మనిష్ఠ, కర్తవ్యపరాయణత్వం, నిస్వార్థ బుద్ధి ఎంతటిదో ఈ సంఘటన బట్టి మనకు అవగతమవుతుంది. ఏదో విధంగా అధికారాన్ని పొందాలనే తాపత్రయం ఆయనలో అణు మాత్రం కూడా గోచరించదు. రాజ్యాధికారాలకన్నా, రాజ్య సుఖాలకన్నా ధర్మమే మిన్నయని ఆచరించి ప్రపంచానికి చూపించిన ఆదర్శప్రాయుడు, ధర్మ నిష్ఠా గరిష్ఠుడు శ్రీరామచంద్రుడు.

## అనుశాసనము

శ్రీరామచంద్రుడు అనుశాసనము ( Discipline ) ను పాటించడంలో అతనికి అతనేసాటి. అతను ఒక మాట అనినచో ప్రతిజ్ఞ చేసినచో ఇక దానికి తిరుగు లేదు. ఆజ్ఞ యిచ్చిన తండ్రి బ్రతిమాలినప్పటికీ, చివరికి మూర్ఛిల్లినప్పటికి, తల్లి శోకించినప్పటికి, లక్ష్మీయులు అడవులకు వద్దని ప్రాధేయపడినప్పటికీ, మహాహార బంధనాలను వటాపంచలు చేసుకొని కానల కేగిన వజ్రసం

## ఏజంట్లకు విజ్ఞప్తి

ప్రతి నెలా 22వ తేదీకల్లా 'శ్రీవాణి'ని పోస్టు చేస్తున్నాము. కొంతమంది ఏజంట్లకు లారీ / ఆర్. టి. సి. బస్సు ద్వారా పంపడం జరుగుతున్నది. అందిన వెంటనే లేఖలు వ్రాయగలరు. ప్రతి నెలా 10వ తేదీకల్లా బిల్లు డబ్బు పంపి సహకరించ ప్రార్థన. ఎక్కువ కాపీలు కావలసినవారు ప్రతి నెలా ఖరులో తెలియపరచాలి.

ధన్యవాదములు

కల్పుడు శ్రీరాముడు. అనుశాసనము విషయమున పరమ కఠోరుడు. ఒక పర్యాయం తన సత్య నిష్ఠను గురించి అర్థాంగి అయిన సీతతో "నేను నా ప్రాణముల నైనను అవసరమైతే త్యజించుదును. అగ్నిసాక్షిగా వివాహమాడిన నిన్ను (సీతను) సైతము విడచుటకు ఏ మాత్రం వెనుకాడను. నన్ను దైవముగా పూజించు చున్న నా అనుంగు సోదరుడు లక్ష్మణుని నైనా త్యజించడానికి ఏ మాత్రం వెనుకాడను. కాని వాగ్దానం చేసిన ప్రతిజ్ఞను మాత్రం నెరవేర్చ కుండా వుండజాలను" అని శ్రీరామ చంద్రుడు తన కఠోర నిర్ణయాన్ని నిష్కర్షగా, నిస్సం కోచంగా ప్రకటిస్తాడు. ఎన్ని ఆపదలు వచ్చినా, అడ్డంకులు ఏర్పడినా, అవాంతరాలు వచ్చిపడినా, తొణకక, బెణకక, ధర్మము తప్పక సంచరించి శ్రీరాముడు అనుశాసనమును పాటించేవాడు.

### రాజనీతిజ్ఞుడు

శ్రీరాముడు గొప్ప రాజనీతి కోవిదుడు. అంతేకాదు శరణాగత పరాయణుడు. ఏదైనా క్లిష్ట సమస్య ఉత్పన్నమైనప్పుడు నిరుత్సాహ పడక, ప్రసన్న చిత్తంతో, వివేకంతో ఆలోచించి, సమయస్ఫూర్తితో సముచితమైన నిర్ణయాలను గైకొనడంలో కడు సమర్థుడు. ధర్మమును పాటించవలసి వచ్చినప్పుడు సంకోచించడం గాని, వెనుక ముందులాడడం కాని వుండేది కాదు. దృఢ వైఖరిని అవలంబించేవాడు విభీషణుని ఆహ్వానించడంలో సుగ్రీవుడు మొదలగు వానర శ్రేష్ఠులు భిన్నాభిప్రాయము లను వెలిబుచ్చినప్పటికీ శ్రీరాముడు తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. విభీషణునికి అభయ మివ్వడమే గాక, సపుత్ర జనబాంధవముగ రావణుని యుద్ధభూమిలో చంప కుండగ అయోధ్యలో అడుగు పెట్టేదిలేదని శ్రీరాముడు శపథం చేస్తాడు. సముద్ర జలాలను తెప్పించి విభీషణునికి లంకా రాజ్యాభిషేకం కూడా గావిస్తాడు. భవిష్యత్తులో ఆక్రమించబోవు లంకా పురిని ముందుగానే విభీషణునికి రాజ్యాభిషేకం చేయడం శ్రీరాముని దూరదృష్టికి, రాజ నీతికి ప్రబల నిదర్శనం. శ్రీరాముడు శరణాగత రక్షకుడే కాదు, దూరదృష్టి గల రాజనీతిజ్ఞుడు కూడాను. నేటి పాల కులు శ్రీరాముని పరిపాలనాదక్షతను, ఆయన ప్రదర్శించిన రాజనీతిజ్ఞతను అనుసరించితే, చక్కటి పరిపాలకులుగా చలామణి కాగలరు.

### భ్రాతృప్రేమ

శ్రీరాముని భ్రాతృప్రేమ వర్ణనాతీతం. సోదరులంటే అతనికి అత్యంత మమకారం. లక్ష్మణుడు లేకుండగ అన్నం భుజించేవాడు కాదు. ఒక పర్యాయం యుద్ధ భూమిలో రావణుడు అతి శక్తివంతమైన 'శక్తి' అనే అస్త్రమును లక్ష్మణుని మీదకు వదలుతాడు. లక్ష్మణుడు మూర్ఛిల్లు తాడు. లక్ష్మణుడు గతించిన తరువాత రావణునితో యుద్ధం చేయడం వ్యర్థమని శ్రీరాముడు భావిస్తాడు. వనవాసానికి బయలుదేరేటప్పుడు, తల్లి సుమిత్రను, భార్య ఊర్మిళను సహితం వదలి తనతోపాటు ఏవిధంగా బయలుదేరి కానల కొచ్చాడో, అదేవిధంగా యమసదనమున కరుగు లక్ష్మ ణునితో కలిసి తానుకూడా యమలోకానికి పోతానని విల పిస్తాడు. లక్ష్మణుడు లేని రాజ్యం స్మశానంతో సమానమని

భావిస్తాడు. మరొక పర్యాయం యుద్ధభూమిలో రామలక్ష్మణులిద్దరూ ఒకే పర్యాయం నాగపాశబద్ధులై మూర్ఛిల్లుతారు. వారిద్దరిలో శ్రీరామునికి ముందుగా తెలివి వస్తుంది. అప్పుడు లక్ష్మణుని చూచి కన్నీరు కారుస్తూ "సీత వంటి భార్య భూలోకమున ఎచటనైనను వెదికిన లభించును. కాని లక్ష్మణునితో సమానమగు సోదరుడు మాత్రం లభించుట దుర్లభం" అని శ్రీరాముడు బావురుమని ఏడుస్తాడు. సోదరులపట్ల గల శ్రీరాముని ప్రేమ అతి పవిత్రమైనది. నిష్కల్మషమైనది. ప్రతిఫలాపేక్షరహితమైనది. సోదరులందరూ శ్రీరాముని ఆదర్శంగా గైకొనినచో అసలు కలహాలకు, కార్పణ్యాలకు తావే వుండదు.

## ఉత్తమమైత్రి

భారతదేశంలో మైత్రికి ఉత్తమమైన స్థానమున్నది. శ్రీకృష్ణ-కుచేలుల మైత్రి ఉత్తమ మైత్రికి నిదర్శనం. పరస్పర ప్రయోజనమును పురస్కరించుకొని రామ-సుగ్రీవులకు మైత్రి ఏర్పడింది. వారి మైత్రి ప్రయోజనసిద్ధితో పరిసమాప్తం కాలేదు. వాలి వధతో సుగ్రీవుడు ఆశించిన పని పూర్తి అయినప్పటికి, కృతఘ్నుడై శ్రీరాముని మేలును మరువలేదు. సీతను వెదకడానికి వానరులను నలువైపులా పంపాడు. లంకాపురిని జయించడానికి తన సర్వశక్తిని ధారపోశాడు. సీతాదేవిని శ్రీరామునికి వప్పగించాడు. శ్రీరాముడు కూడా తన పని పూర్తి అయిందని భావించి, స్వార్థంతో సుగ్రీవ బృందమును వదలి వేయలేదు. వారందరిని అయోధ్యకు తీసుకొని వెళ్లి ఉచితరీతిని గౌరవించి, సన్మానించి, కానుకలు సమర్పించి ఆదర్శ స్నేహ శీలమును ప్రదర్శించుతాడు శ్రీరాముడు. సహజంగా ప్రస్తుత సమాజంలో తమ పని పూర్తి చేసుకొనేంత వరకూ వెంటపడి తిరుగుతూ వుంటారు. ఇంద్రుడూ, చంద్రుడూ అని పొగడుతుంటారు. పని పూర్తి కావడంతోనే కంటికి కనపడకుండా మటుమాయమవుతారు. శ్రీరామ-సుగ్రీవుల మైత్రి మాత్రం అటువంటిది కాదు. భావితరాలకు 'చక్కటి



ఆదర్శప్రాయమైనది. నేటి సమాజం కృష్ణ-కుచేలులను, రామ-సుగ్రీవులను ఆదర్శముగా గైకొంటే కలతలకు, కల్మషాలకు, వైషమ్యాలకు, ద్వేషాలకు ఆస్కారమే వుండదు.

## ఆదర్శవీరుడు

శ్రీరామచంద్రుడు ఆదర్శవీరుడు. ఒక పర్యాయం యుద్ధభూమిలో రామబాణం ధాటికి తట్టుకోలేక, రావణుడు తన ఆయుధాలనన్నింటిని కోల్పోయి నిస్సహాయస్థితిలో దిక్కుతోచక నిలబడి వుంటాడు. అటువంటి స్థితిలో రావణుని చంపడం ధర్మం కాదని శ్రీరాముడు భావించి, "ఓ రాక్షసరాజా ! లంకా పట్నంలోనికి వెళ్లి కొంచం విశ్రాంతి తీసుకో. పాపం ! అలసిపోయినావు. ధనస్సును ధరించి రథారూఢుడవై తిరిగి మళ్లీ యుద్ధభూమికి రా ! అప్పుడు నా పరాక్రమమును చూచెదవుగాక !" అని శ్రీరాముడు ఎంతో హుందాతనంగా, ఔదార్యంతో ప్రవర్తిస్తాడు. ప్రియాతి ప్రియమైన తన అర్ధాంగి సీతను అపహరించిన పరమ కిరాతకుడు తన చేజిక్కినప్పటికి, అవకాశం దొరికిందికదా యని కక్షతో, అధర్మంగా రావణుని చంపలేదు. యుద్ధనీతిని, మర్యాదను, అనుసరించిన ధర్మశ్రేష్ఠుడు. అన్యాయంగా అక్రమంగా, దొంగచాటుగా యుద్ధాలకు పురిగొల్పుతున్న నేటి ప్రభుత్వాధినేతలు శ్రీరామునిని గురించి తెలుసుకోవలసింది ఎంతో వున్నది.

## సచ్ఛీల సంపన్నుడు

శత్రువులకు సహితం శ్రీరాముని సచ్ఛీలము యెడల అత్యున్నతమైన విశ్వాసం, గౌరవం వుండేది. యుద్ధ

**శ్రీవాణి**

## విజ్ఞప్తి

ఇప్పటివరకు సంవత్సర చందాదారులుగా చేరనివారు వెంటనే పంపి సహకరించండి. చేరిన వారు కనీసం ఒక మిత్రునితో సంవత్సర చందా కట్టించి ప్రోత్సహించండి. ఆర్థిక స్తోమత గలవారు జీవిత సభ్యత్వం ( రు 500/) ఫోటోతో సహా పంపి చేయూత నివ్వండి. ఇంకా ఆర్థికస్తోమత ఉన్న ఉదార స్వభావులు పోషకులు ( రు1000/- )రాజ పోషకులు (రు 5,000/-), మహారాజ పోషకులు రు (10,000/-) గా చేరుతూ తమ ఫోటోలను కూడా పంపి ఆర్థికపుష్టిని చేకూర్చండి. వ్యాపారస్తులు, పారిశ్రామిక వేత్తలు తమ ప్రకటనలను పంపి ప్రోత్సహించండి. జీవిత సభ్యులుగ, విరాళదాతలుగా చేరడానికి అంగీకరించి, డబ్బు పంపని వారు వెంటనే పంపి సహకరించండి. సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక ప్రచారానికి తోడ్పడండి.

ధన్యవాదములు

భూమిలో రావణుని కుమారుడైన మేఘనాధుణ్ని లక్ష్మణుడు చంపుతాడు. భార్య సులోచన సహగమనము చేయ సంకల్పించుకుంటుంది. భర్త మృతదేహం శతృశిబిరంపైపు అనగా శ్రీరాముని గుడారం వైపు పడివుంటుంది. రావణుడు దుఃఖిస్తున్న కోడలిని పిలిచి శ్రీరాముని శిబిరానికి వెళ్ళి, అడిగి భర్త మృతదేహాన్ని తెచ్చుకోమని ఆజ్ఞాపిస్తాడు. శతృ శిబిరానికి వంటరిగా వెళ్ళడానికి సులోచన సందేహిస్తుంది. అప్పుడు రావణుడు "బాల బ్రహ్మచారి హనుమంతుడు, జితేంద్రియుడు లక్ష్మణుడు, ఏకపత్నీవ్రతుడు శ్రీరాముడు వున్న చోటికి నీవు నిర్భయంగా వెళ్ళవచ్చు" అని ఎంతో విశ్వాసంతో అంటాడు. అప్పుడు "మీరు శ్రీరాముని భార్యను తెచ్చారే! అలాంటి శ్రీరాముని వద్దకు మీ కోడలిని పంపడం ఉచితమా?" అని మంత్రులు సందేహాన్ని వెలిబుచ్చుతారు. అప్పుడు రావణుడు "పర స్త్రీలను అపహరించడం ఈ రావణుని పని, రాముునిపని కాదు" అని అంటాడు. శతృవులకు సహితం శ్రీరాముని యెడల ఎంతటి సద్భావ ముండేదో, అతని శీలం యెడల ఎటువంటి విశ్వాసం వుండేదో ఈ సంఘటన ఋజువు చేస్తున్నది. పరస్త్రీలను తన స్వంత సోదరీమణులలా చూసుకొనేటటువంటి సచ్ఛీలసంపన్నుడు శ్రీరామచంద్రుడు.

## ఏకపత్నీవ్రతుడు

సీతాదేవి అడవులలో నున్నప్పుడు శ్రీరాముడు అశ్వమేథయాగం చేయ సంకల్పించుకుంటాడు. సతీసమేతుడైనవాడు మాత్రమే ఈ యాగం చేయడానికి అర్హుడు. అటువంటి స్థితిలో కూడా ద్వితీయపత్నిని పరిగ్రహించడానికి సుతరామూ అంగీకరించడు. సువర్ణ సీతామూర్తిని ప్రక్కన పెట్టుకొని యాగం పూర్తి చేస్తాడు. ఆ కాలంలో బహు భార్యాత్వం తప్పు కాదు. తండ్రియైన దశరథునికి 350 మంది భార్యలుండేవారని పురాణాలు చెబుతున్నాయి. బహు భార్యాత్వాన్ని ప్రోత్సహించిన ఆనాటి సమాజ పరిస్థితులలోకూడ శ్రీరామచంద్రుడు 'ఏకపత్నీ వ్రతాన్ని' విడనాడలేదు. ఈ సంఘటన శ్రీరాముని సౌశీల్యాన్ని యినుమడింప జేస్తున్నది. కామాంధకారంతో కన్ను మిన్ను కానకుండా, కనపడిన స్త్రీనల్లా చెరలో పెట్టి పశువులలా అనుభవించ ప్రయత్నిస్తున్న నేటి సమాజంలో నున్న కామాంధులకు శ్రీరాముని సౌశీల్యం కనువిప్పు కాగలుగుతే

దేశంలో శీల సంపద అభివృద్ధిచెంది సుఖశాంతులతో మహిళలు నిర్భయంగా తిరుగగలుగుతారు.

## కర్తవ్యపాలన

శ్రీరాముడు కర్తవ్య పాలన విషయంలో కూడా పరమ కఠోరుడు. శ్రీరాముడు ఒక పర్యాయం బ్రాహ్మణ వేషంలో వచ్చిన కాలయమునితో రహస్య సంభాషణలు చేయవలసి వస్తుంది. అప్పుడు లక్ష్మణుని ద్వారం వద్ద కాపలా వుంచి, లోపలికి ఎవరినైనా రానిచ్చిన యెడల తల తీసివేయడం జరుగుతుందని లక్ష్మణుని హెచ్చరిస్తాడు. అన్న యాజ్ఞ ప్రకారం లక్ష్మణుడు కాపలాకాస్తుంటాడు. ఇంతలో దూర్వాస మహర్షి వచ్చి తక్షణమే శ్రీరాముని దర్శించాలని వత్తిడి చేస్తాడు. లక్ష్మణుడు ససేమిరా అంగీకరించడు. దూర్వాసునికి కోపం వస్తుంది. తన రాకను గురించి వెంటనే శ్రీరామునికి తెలియబరచనిచో అయోధ్యా రాజ్యం, రాజసంతతి, ప్రజలూ యావత్తూ సర్వనాశనం అయ్యేట్లుగా శపించుతానని దూర్వాస మహర్షి హెచ్చరించుతాడు. లక్ష్మణునికి సంకట పరిస్థితి ఏర్పడుతుంది. తనవల్ల దేశం మొత్తం సర్వనాశనం కావడం మంచిది కాదని, తానొక్కడూ శ్రీరాముని ఆగ్రహానికి గురియై మరణించినా ఫరవాలేదని లక్ష్మణుడు భావిస్తాడు. లోపలికి వెళ్ళి దూర్వాస మహర్షి రాకను శ్రీరామునికి తెలియ బరుస్తాడు. కాలయముని పంపించి, దూర్వాసుని ఆహ్వానించి, మృష్టాన్నముచే తృప్తి పరచి పంపిస్తాడు. శ్రీరాముడు దీర్ఘాలోచనలో పడులాడు. అనుంగు తమ్ముడు, తనకోసం స్వసుఖాలను సహితం త్యజించి తనతోపాటు పదునాలుగు సంవత్సరాలు వనవాసం చేసిన సోదరుని వధించవలసి వచ్చినందుకు ఎంతగానో శ్రీరాముడు విచారిస్తాడు. అప్పుడు లక్ష్మణుడు శ్రీరాముని వద్దకు వెళ్ళి "నాకొరకు విచారించకుము. నన్ను వధించి ప్రతిజ్ఞను పాలింపుము" అని వేడుకుంటాడు. శ్రీరామునికి ఏమి చేయాలో తోచదు. ఒక వైపు ప్రతిజ్ఞాపాలన మరొక వైపు తనను మనసారా ప్రేమిస్తూ, సేవిస్తున్న అనుంగు తమ్ముడు. ఒక వైపు కర్తవ్యపాలన మరొకవైపు తనకోసం సర్వస్వాన్ని అర్పించిన సోదరుడు. అప్పుడు నీతి కోవిదులను పిలుస్తాడు శ్రీరాముడు. సంకట పరిస్థితిని వివరిస్తాడు. కర్తవ్యాన్ని ప్రభోదించమని వారిని వేడుకుంటాడు. ధర్మ విరుద్ధమైన నిర్ణయాన్ని అంగీకరించనంటాడు. వారి సలహా ప్రకారం లక్ష్మణుని దేశబహిష్కారం చేస్తాడు. లక్ష్మణుడు ఏమాత్రం కోపించక రామాజ్ఞను శిరసావహించి దేశాన్ని విడిచి వెళ్ళిపోతాడు. సోదరులూ, కొడుకులూ ఎన్ని ఘోర కృత్యాలు చేసినా వారికి రక్షణ యిస్తున్న నేటి పాలకులకు శ్రీరాముడు ఆదర్శప్రాయుడు కాదా? పరిపాలకులు శ్రీరాముని ఆదర్శంగా గైకొనే శుభదినం ఎప్పుడు వస్తుందో?

## మాతృదేశభక్తి

త్రిలోకాధిపతియైన రావణుడు శ్రీరాముని చేతిలో మరణిస్తాడు. యుద్ధం ముగుస్తుంది. లంకాపురి శ్రీరామునికి వశమవుతుంది. సువర్ణమయమయిన లంకాపురిని చూచి లక్ష్మణుడు మోహ పడతాడు. లంకాపురిని వదలి వెళ్ళడానికి లక్ష్మణునికి మనస్కరించక "అన్నయ్యా! సువర్ణమయమయిన ఈ లంకాపురిని వదిలి, నిరుపేదదైన అయోధ్యకు వెళ్ళడం దేనికి? ఇక్కడనే వుండి సకల సంపదలను అనుభవిస్తూ హాయిగా కాలం గడుపుదాం" అనిఅంటాడు. అప్పుడు ఎంతో బాధతో, వ్యధతో, కోపంతో, శ్రీరాముడు లక్ష్మణునికి ప్రత్యుత్తరము యిస్తాడు.

" అపి స్వర్ణమయీ లంకా న మే లక్ష్మణ రోచతే
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి "

"ఓ లక్ష్మణా! లంక బంగారుమయమైనను నాకు ఇష్టమగుట లేదు. తల్లియు, జన్మించిన దేశమును స్వర్గము కంటె శ్రేష్ఠమైనవి" అని శ్రీరాముడు బోధిస్తాడు. ఈ సంఘటన వలన శ్రీరామునికి ఎంతటి మాతృదేశ భక్తి వుండేదో అవగతమవుతుంది. తల్లి కురూపి కావచ్చు. అంగవైకల్యముకలది కావచ్చు. ముసలిది అవవచ్చును. అయినప్పటికి నవమాసాలు మోసి కని పెంచిన తల్లి తల్లే. ఆమె మాతృమూర్తే. అదేవిధముగా

జన్మించిన దేశం పేదది కావచ్చు, బీదదికావచ్చు. తల్లి లాంటిదే జన్మించిన దేశం కూడాను. ఈ భావాన్నే శ్రీరామచంద్రుడు ప్రపంచానికి చాటాడు.

## మారీచుని ప్రశంశ

మారీచుడు శ్రీరామునికి బద్ధ శత్రువే అయినప్పటి, శ్రీరామునిలోని ఉత్తమ గుణాలను ప్రశంసిస్తూ రావణునితో "శ్రీరామచంద్రుడు నీవు భావించినట్లుగా కర్కశుడు కాదు. అజ్ఞాని అంతకన్నా కాదు. అబద్ధమాడడు. ధర్మమూర్తి, సాధువు, సత్య పరాక్రముడు" అని ఎంతగానో పొగడుతాడు. శ్రీరాముని యొక్క నడత, అతడనుసరించిన సత్యవిధానము, చేబట్టిన ధర్మపంథా శత్రువులను సహితం ముగ్ధులను గావించింది. శత్రువులు సహితం అతనిలో ఏ తప్పు పట్టలేకపోయేవారు. సరైన వీరుని లక్షణం అదే. స్వపక్షీయుల మెప్పును పొందడం సహజం. ప్రతిపక్షీయుల అభిమానాన్ని చూరగొనడం మాత్రం చాలా కష్టం. సామాన్యులకు అది అసంభవం. మహనీయులకు మాత్రమే అది సాధ్యమవుతుంది. శ్రీరాముడు మాత్రం ఆ ఉత్తమ కోవకు చెందిన వాడనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

రామాయణ మహాకావ్యంలోని పాత్రలందరూ ధర్మస్వరూపులే. ధర్మాన్ని అనిష్ఠించడమే వారి జీవిత లక్ష్యం. ధర్మ మార్గాన నడవడమే వారి జీవిత ఆశయం. సత్య-ధర్మాలే వారిని నడిపించాయి. రామాయణ సందేశం ప్రపంచానికి ఆదర్శమైన రోజున, రామాయణ పాత్రలు చేసిన త్యాగాలు మానవాళి ఆదర్శముగా గైకొనిన శుభదినాన; వారు చేపట్టిన ధర్మ పథమును సమాజం ఆదర్శంగా స్వీకరించిన పుణ్యదినాన, వారు నడచిన సత్యమార్గమున ప్రజానీకం నడిచిన పవిత్ర శుభ సమయాన కలియుగం కృతయుగంగా మారిపోతుంది. ప్రజలు సుఖశాంతులతో జీవించుతారు. అప్పుడే మహాత్మాగాంధీజీ ఆశించిన రామరాజ్యాన్ని తిరిగి మనం కళ్ళారా చూడగలుగుతాం.

రామాయణం మనకు యిచ్చే సందేశం, ఆదేశం "సత్య, ధర్మ, త్యాగాలు." టిని అనుష్ఠించడం మన జీవిత లక్ష్యం.

"తరాలు తరలినా యుగాలు దొరలినా
ఉదాత్తత తరగని నిత్య నూతన గాథ
రామాయణం"

★★★

# ప్రతి యుగాది ప్రకృతి హృదయం వేది

ప్రకృతికాంత ఎంత మనోహారిణి? ఎంతటి నవనాగరక నారీ శిరోమణి? ఆమె అందచందాలతో పోటీపడే పూఁబోడు లున్నారా? గెలువగల కిన్నెరకంఠులున్నారా? వసంతంలో ఆమె మరింత మనోహర.

సూర్యోదయం ఆమెకు ప్రతిదిన భాగ్యోదయం. పక్షుల కలకలా రావాల సుప్రభాత సేవలందుకొంటుంది. కదలి అలల కలల పైని, నదీ తరంగాల తురంగాల పైని తేలియాడి జలకాలాడుతుంది.

వెలుగుల వలువలతో ఒడలద్ది, పుప్పొడుల తిలకం దిద్ది కోకిలా స్వరఝరుల మధురపానీయం సేవించి గున్నమామిడి కొమ్మకోనల్లో ఆడుతూ పాడుతూ ఆనందాన్ని పంచిపెడుతుంది. పగటి బడలికలు తీర్చుకొని రేయి హాయిగా గడుపుతుంది.

సమయపాలన ఆమెకు పుట్టుకతో అబ్బిన క్రమశిక్షణ. ఆమె గడియారం అమోఘమైంది. ఋతువుల అంకెలు, నెలల గీతలు ఉంటాయి. వాటి మీద సూర్యచంద్రుల కిరణాలు సూచికలై తిరుగుతూ ఉంటాయి.

అందులోనే ఒకమూల తిథివార నక్షత్రాల మినీ గడియారం. ఘడియలు, విఘడియలు, క్షణాలు కదులుతుంటే కాలం ఠీవిగా నడుస్తూ ఉంటుంది. అది వేసే ప్రతి అడుగూ, మానవుల జీవితాల నిడివిని కుఋచబఋచే వింత నడక. అది దాని విధి. దానికదే వినోదం.

ఆ గడియారానికి 'కీ' యివ్వనక్కరలేకుండా సృష్టికర్త అమర్చి పెట్టాడు. అంతే కాదు, ఎలక్ట్రానిక్ వాచీలకైనా రిపేరు వస్తుందేమోకాని, దానికా స్థితి రాదు.

నిత్య చైతన్యంతో అనుక్షణ గమనంతో సాగిపోయే అటువంటి కాలప్రవాహపు ప్రభావం చిత్రమైంది. మార్పు దాని ఊర్పు. నిన్నటి వెలుగే, నిన్నటి వేవెలుగే యీరోజు వచ్చినా, నిన్నలేని క్రొత్తదనం ఈరోజు ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. అందుకే ఎన్ని ఉగాదులు వచ్చి వెడుతున్నా ప్రతి ఉగాదికీ ప్రత్యేకత.

## పువ్వాడ తిక్కన సోమయాజి

చైత్రమాసంతో ఆరంభమయ్యే నూత్న సంవత్సరానికి వసంతర్తువు స్వాగత గీతం ఆలపిస్తుంది. అనువైన వాతావరణం సమకూర్చి ఆహ్లాదం కలిగిస్తుంది. ప్రశాంత చిత్తంతో భవిష్యత్తును గూర్చి ఆలోచింప జేస్తుంది. క్రొత్త క్రొత్త ఆశలతో, ఆశయాలతో అనుభూతులతో మానవాళిని ఉత్తేజపరుస్తుంది.

నూతన సంవత్సరపు తొలి రోజును 'ఉగాది' పర్వదినంగా జరుపుకుంటున్నాం. 'యుగాది' యే ఉగాది యైనదని అంటారు. యుగము - అంటే జంట అనే అర్థంలో, నియతమైన రెండు క్షణముల మధ్యకాలం ఒక సంవత్సరంగా నిర్దేశించినట్లయితే, ఆ క్షణముల యుగం (జంట)లో తొలిది యుగాది-

“ తేలికగల పదార్థములలో గడ్డిపోచ తేలిక. దానికన్నా దూదితేలిక. మరి దానికన్నా యాచకుడు తేలిక ”

—చాణక్యనీతి

అని యొక శాస్త్రజ్ఞుని యూహ. ఆ తొలిరోజునే మనం యుగాది గాను, రూపాంతరం చెందిన ఉగాది గాను పేరు పెట్టుకొని పండుగ చేసికొంటున్నాం.

ఉగాది అనగానే నోరూరించేది ఉగాది పచ్చడి. వేపపువ్వు, మామిడిముక్కలు, చింత పండు, క్రొత్తబెల్లం ఇత్యాదిగా షడ్రసాల సారభూతమైన మిశ్రమమది. అది తింటే ఉగాది పండుగ చేసికొన్నట్లే.

జీవితంలో మానవు లనుభవించే అనేక సుఖదుఃఖాల సమ్మిశ్రమంగా ఉగాది పచ్చడిని సంభావింపవచ్చు. తనలో ఇమిడి యున్న రసాలకు మించిన రుచులందిస్తూ చవులూరించే జీవిత రసాయన మది.

చేదు చేదును విరుస్తుంది. వేపపువ్వు క్రిమి సంహారం చేసి ఆరోగ్యం ప్రసాదిస్తుంది. ప్రకృతి మాత మనకందించే అమృత ప్రాయమైన ఔషధంగా దాన్ని స్వీకరించవచ్చు.

మామిడి చెట్టు మనకు కల్యాణవృక్షం. జగత్కల్యాణానికి తోరణం కట్టే కల్పవృక్షం. ఊరుగాయలకు ఊటలూరిస్తూ, ఫలరసాలతో నోరూరజేస్తూ ఆబాలగోపాలానికీ ప్రీతిపాత్రమైనది ఈ రసాలసాలమే.

సంవత్సరాది శుభసమయాన పంచాంగశ్రవణం శ్రేయోదాయకమని పెద్దలు చెబుతారు. కాలంగీసే గీతలు దాటరానివే. అయినా, ముందున్న మార్గం సుగమమో దుర్గమమో ముందుగా తెలిసికొని తగిన శ్రద్ధ తీసికొనటానికి పంచాంగశ్రవణం ప్రత్యక్షంగా ఉపకరిస్తుంది.

వసంతాలెన్ని గడుస్తున్నా సామాన్యుల జీవిత వసంతాలు మాత్రం ఎండమావులుగానో, గగన కుసుమాలుగానో ఊహ మాత్రము లవుతున్నాయనటంలో సందేహంలేదు.

అమితమైన ఆశలు, అనవసరమైన ప్రయాసలు, ఏదో అందుకోవాలని ఆరాటం, మనస్సును అసంతృప్తికి లోను చేస్తున్నాయి. మూల కారణం గమ్యం తెలియని గమనం, పరమార్థము వంకకు దృష్టి మరల్చక పోవటం అనిపిస్తుంది. ఇదంతా మానవ ప్రకృతికి సంబంధించినది. ఇంకా లోతులకు పోవద్దు.

గతం నేర్పిన పాఠాలయినా పునశ్చరణ చేసికొంటూ, రానున్న కాలాన్ని క్రొత్త మార్గాలకు మలచుకొంటూ, ఉన్నంతలో సంతృప్తి చెందటానికి ప్రయత్నం చెయ్యటమే ప్రస్తుత కర్తవ్యం.

ప్రకృతిమాత ఎంత సౌమనస్వియో అంతటి కర్కశాత్మ. ఆమె ఎల్లప్పుడూ సుప్రసన్నమై ప్రజావళిని సమాదరించాలని ప్రార్థిస్తూ, ఉగాది పర్వదినాన కాలస్వరూపుడైన పరమేశ్వరుణ్ణి వసుధైక కుటుంబానికి శుభపరంపరలు ప్రసాదింపమని వేడుతూ కైమోడ్పు లర్పిద్దాం.

# సుప్రసిద్ధ పత్రికా సంపాదకుడు

# నార్ల వెంకటేశ్వరరావు

తమ కలంద్వారా ప్రజలలో నవ చైతన్యాన్ని కలిగించిన ఆదర్శ పత్రికా సంపాదకులు తెలుగునాట ముగ్గురే ముగ్గురు. వారిలో మొదటివారు కందుకూరి వారైతే, రెండవ వారు ముట్నూరివారు. మూడవవారు నార్లవారు.

శ్రీ నార్ల సుప్రసిద్ధ పత్రికా సంపాదకులుగా, కవిగా, కథకుడుగా, విమర్శకుడుగా పేరు తుల నందుకున్నారు. నార్ల మరణంతో తెలుగు పత్రికా రంగంలో ఒక మహత్తర అధ్యాయం ముగిసింది. తెలుగు, ఆంగ్లభాషలో దాదాపు 30 గ్రంథాలు నార్ల రచించారు. ఆయన రచనలు కొన్ని హిందీ, మరాఠీ, గుజరాతీ, ఒరియా, బెంగాలీ, అస్సామీ, తమిళం, కన్నడం, మళయాళీ భాషలలోనికి అనువాదం అయినాయి.

శ్రీ నార్ల వారి తొలి రచన " నేటి రష్యా ". ఇది 1930 లో వెలువడింది. అయితే అప్పటి బ్రిటీష్ ప్రభుత్వం దానిని నిషేధించింది. " East west ntellectuals" " Poverty of india"; " Cast complex " వంటి నార్లవారి ఉపన్యాస సంపుటాలను ఉస్మానియా, మైసూరు విశ్వవిద్యాలయములు ప్రచురించాయి.

శ్రీ నార్ల రచించిన " సీతజోస్యం " నాటకానికి 98 లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. దని మీద వివాదం తలయెత్తగా ఆయన అవార్డును తిరస్కరించారు.

వీరేశలింగం, గురజాడ, వేమనల జీవిత చరిత్రల గ్రంథాలను వీరు ఇంగ్లీషులో వ్రాశారు.

శ్రీ నార్లవారు బందరులో చదువుకొనే రోజులలో ప్రతి నిత్యమూ ' కృష్ణాపత్రిక ' కార్యాలయమునకు వెళ్లి పత్రికకు కావలసిన హంగులను సమకూరుస్తుండేవారు. 1929 లో శ్రీ ముట్నూరివారు జైలుకు వెళ్ళగా, ఆ బాధ్యత తను కోట సుబ్బారావుగారు నిర్వహించేవారు. శ్రీ కృష్ణారావుగారు జైలు నుంచి వచ్చిన తర్వాత కూడా వారికి చేదోడు వాదోడుగా వుండేవారు. " స్వదేశ సంస్థానాలు " అనే పుస్తకాన్ని నార్ల వారు వ్రాసి సమీక్షకు శ్రీ ముట్నూరివారికి యివ్వగా, దానిపై ముట్నూరివారు సంపాదకీయమే వ్రాయడం జరిగింది.

## సవ్యసాచి

బందరు వంటి చిన్న పట్టణంలో వుంటే రాణించలేమని భావించి, నార్లవారు మద్రాసుకు ప్రయాణం కట్టారు. నార్లవారు తన పత్రికారచనకు ప్రకాశంగారి ' స్వరాజ్య ' పత్రికతో శ్రీకారం చుట్టారు. తాపీ వారి ' జనవాణి ' లోను, గూడవల్లివారి 'ప్రజామిత్ర' లోను కొంతకాలం పనిచేశారు. 1938లో ' ఆంధ్రప్రభ ' న్యూస్ ఎడిటర్‌గా చేరారు. 1942 నుండి 1959 వరకు ఆంధ్రప్రభ సంపాదకునిగాను 1960 నుండి 1976 వరకు ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకునిగాను పని చేశారు. ఆ తరువాత 1977 జనవరి 30 వరకు ' ఆంధ్రజ్యోతి ' ప్రధాన సంపాదకులుగాను, 1977 ఏప్రియల్ 2 వ తేదీ వరకు దాని ' లిటరరీ ఎడిటర్ ' గాను వున్నారు. కేంద్ర సాహిత్య అకాడమీ, లలితకళా అకాడమీ, రాష్ట్ర సాహిత్య అకాడమీలలో సభ్యులుగా కొంతకాలం వున్నారు. శ్రీ నార్ల రెండుపర్యాయములు రాజ్యసభ సభ్యులుగా కూడా వున్నారు. 1945–49 మధ్యకాలంలో ఆంధ్ర ప్రదేశ్ పత్రికా రచయితల సంఘ అధ్యక్షుడుగా పని



# మరణిస్తే...

నే మరణిస్తే
వ్రాస్తాయండీ
వ్రాస్తాయి–కొన్ని
పత్రికలైనా
ప్రముఖుండొక్కడు
పరలోకానికి
పయనించాడని—

నే మరణిస్తే
అంటారండీ
అంటారు – నేడు
తెలుగు జాతికీ
తీరని నష్టం
వాటిల్లిందని
నోటిమాటగా—

నే మరణిస్తే
చేస్తారండీ
చేస్తారు – పెక్కు
ఆంధ్రసభల నా
ఆత్మశాంతికై
తరయక తెగ
బారెడు తీర్మానం

నే మరణిస్తే
వస్తాయి సుమా
వస్తాయి – కొన్ని
ప్రకటనలైనా
ప్రజాకోటి, నా
స్మారక చిహ్నం
స్థాపించాలని—

నే మరణిస్తే
రాను నిజంగా
రాను సోదెలో
కైనా, గిరుగ
అయిదారు నెలలు
తిరుగక ముందే
తెలుగు గడ్డపై

నే మరణిస్తే
ఏ నా ఫొటో
ఏ యెదలోనో
చిక్కని చీకటి
చీల్చగ పెట్టిన
దీపము మాత్రమె
దీటుగ నిలుచును
నే మరణిస్తే

పై గేయం నార్లవారిచే వ్రాయబడి 1955 జనవరిలో ఆంధ్రప్రభ వారపత్రికలో ప్రచురితమైనది.

పంపినవారు : జి జానకిరామశర్మ, తెనాలి

చేశారు. వీరు కొంతకాలం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల గౌరవ సలహాదారునిగా వున్నారు. "ఉత్తమ చిత్రాల ఎంపిక సంఘం"లో సభ్యునిగా వ్యవహరించారు. ఆరు పర్యాయాలు విదేశాలలో విస్తృతంగా పర్యటించారు.

పత్రికా రచనలో నిమాత్నమైన మార్పులు తీసికొని వచ్చిన ఘనత నార్లవారికే దక్కింది. శీర్షికల పేరు పెట్ట టంలోను ఆయనకు ఆయనే సాటి. పతాక శీర్షిక చదవడం తోనే వ్యాసం లేక సంపాదకీయంలోని సగం భావం చదువరులకు అర్థమయ్యేటట్లుగా వుండాలని వారి భావన. భారతదేశమునకు స్వాతంత్ర్యం వచ్చినప్పుడు "జయ జయ భారత జనయిత్రి దివ్యగాత్రి" అన్న పెద్ద శీర్షిక పెట్టి "చిరదాస్య తిమిరాలను చీల్చుకుంటూ భారత స్వాతంత్ర్య భానూదయం" అని ప్రచురించి పాఠకులను

ఉత్తేజ పరిచారు. మహాత్మాగాంధీజీ పరమపదించినప్పుడు " నాడు ఏసుక్రీస్తు శిలువకు బలి. నేడు గాంధీజీ తుపాకికి బలి " అని పతాక శీర్షిక పెట్టి ప్రజల ఆవేదనను ప్రస్ఫుటం చేశారు. గాంధీజీ దహనసంస్కార వార్తను " భారతావనిలో గాడాంధకారం. స్వర్గధామంలో దివ్య ప్రభలు " అని శీర్షిక పెట్టి కుమిలి కృశించి ఆవేదనలో ఆక్రందన చేస్తున్న ప్రజల మనోభిప్రాయాలకనుగుణంగా రచన చేశారు. కొన్ని కొన్ని సందర్భాలలో నార్లవారి సంపాదకీయాలమీద వాదోపవాదాలు చెలరేగేవి. అయినప్పటికీ జంకూ, గొంకూ లేకుండా వాటిని ఆయన ఎదుర్కొనేవారు.

సరిక్రొత్త పోకడలతో, ప్రజలు అర్థం చేసుకొనే భాషలో, అభ్యుదయ భావాల వ్యాప్తికై తన కలంద్వారా ప్రజలను కదిలించిన సంపాదకీయాలు ఎన్నో వ్రాశారు. ప్రలోభాలకు లొంగక, ప్రభావాలకు లోనుకాకుండా నిర్భీతిగా వ్యాఖ్యలు చేశారు. నిశిత విమర్శనలతో, ఉన్నత ప్రమాణాలతో సంపాదకీయాలను ప్రజలకందించిన ఘనత నార్లవారికే దక్కింది. చిన్న చిన్న వ్యాఖ్యలతో పెద్ద, ఉన్నత భావాలను వెలిబుచ్చడంలో వారికి వారే సాటి. నార్లవారు ఎందరో పత్రికా రచయితలకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను స్ఫూర్తినిచ్చారు. నిరంతర అధ్యయనంద్వారా సాధించి దాచుకున్న విజ్ఞానాన్ని తన విలువైన వ్యాఖ్యలను జోడించి అందించిన " గాడ్స్, గాబ్లిన్స్ అండ్ మెన్ " అను గ్రంథం పత్రికా రచయితలు తప్పనిసరిగా చదువవలసిన ఉత్తమ గ్రంథం. " వాస్తవంబు నార్లవారి మాట " " నవయుగాల బాట నార్లమాట " అన్న మకుటాలతో వారు వ్రాసిన పద్యాలు బహుళ ప్రచారంలోనికి వచ్చాయి. భగవద్గీతపై ఆంగ్లంలో రచించిన విమర్శనాత్మకగ్రంథం శ్రీ నార్లవారి చివర రచన. అది ఇంకా ముద్రితం కాలేదు.

వీరికి భార్య, ముగ్గురు కుమారులు, ఐదుగురు కుమార్తెలు వున్నారు. 1908 డిశంబరు 1 వ తేదీన జబల్‌పూర్‌లో జన్మించారు. వీరి గ్రామం కృష్ణాజిల్లా కౌతరం.

# ఉగాది

పాఠకులకు, ప్రకటనకర్తలకు,
ఏజంట్లకు, రచయితలకు,
విరాళదాతలకు, జీవిత సభ్యులకు,
అందరికీ

ఉగాది శుభాకాంక్షలు!

— సంపాదకుడు

1985 వ ఫిబ్రవరి 16 వ తేదీ ఉ. 9. 30 గంటలకు గుండె పోటుతో హైదరాబాద్‌లోని నిజాం ఆర్థోపెడిక్ ఆస్పత్రిలో కన్నుమూశారు.

ఒక మహారచయిత, సుప్రసిద్ధ పాత్రికేయుడ్ని ఆంధ్రదేశం కోల్పోయింది. వాడి వేడి మాటలతో, విస్పష్టమైన భాషలో, అభ్యుదయ భావాలను ధైర్యంగా, సూటిగా నిర్భయంగా చెప్పగలిన ప్రముఖ పత్రికా సంపాదకుడు నార్లవారు యింక మనకు భౌతికం కనిపించక పోయినా వారి అమూల్యమైన రచనలు మన చెవులలో రింగు రింగుమంటునే వుంటాయి. వారు జర్నలిజానికి వేసిన బాట, చేసిన సేవ భావితరాలకు చిరస్మరణీయాలు. జర్నలిజంలో ఆయన నెలకొల్పిన సాంప్రదాయాలను చిరస్థాయిగా నిలిపేందుకు కృషి చేయడం మన కర్తవ్యం.

# ఇంతకూ ప్రజలు గెల్చినట్లా? ఓడినట్లా?

లోకసభ ఎన్నికల్లో 49 శాతం ఓట్లతో 402 సీట్లు సంపాదించిన కాంగ్రెసు (ఐ) రెండు నెలలు తిరగక ముందే జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో 26 శాతం ఓట్లు కోల్పోయింది. లోకసభ ఎన్నికల్లో 2461 అసెంబ్లీ నియోజక వర్గ భాగాలలో కాంగ్రెసు (ఐ) అధిక ఓట్లు సంపాదిస్తే అసెంబ్లీ ఎన్నికల్లో దానికి వచ్చిన మొత్తం సీట్లు 1430. హిమాచల్‌లో లోకసభ ఎన్నికల్లో 58 అసెంబ్లీ నియోజక వర్గభాగాలలో కాంగ్రెసుకు ఆధిక్యత లభిస్తే అసెంబ్లీ ఎన్నికల్లో 55 స్థానాలకు దిగింది. ఒరిస్సాలో 125 నుండి 117కు; కర్నాటకలో 179 నుండి 139కి ఆంధ్రప్రదేశ్‌లో 75 నుండి 49కి; మహారాష్ట్రలో 222 నుండి 162కి, ఉత్తరప్రదేశ్‌లో 383 నుండి 265కు ఇలా మొత్తం మీద అన్ని రాష్ట్రాల్లోను కాంగ్రెసు (ఐ) తక్కువలోనే గెల్చినట్లు లెక్కలు చెప్తున్నాయి. ఒక్క గుజరాత్ మాత్రం మినహాయింపుగా కనిపిస్తుంది. అక్కడ 140 నుండి 149కి పెరిగింది. దేశంలో అసలు ప్రతిపక్షం లేని ప్రజాస్వామ్యం ఏర్పడి సంచలనం తప్పిపోయిందా అని పలుపురు భావించిన స్థితిలో ఇది గుడ్డిలో ల్ల అనాలి.

మొత్తం వివిధరాష్ట్రాల్లోను ప్రభుత్వాలు ఏర్పడిన స్థితిని గమనిస్తే- అధికారంలో ఉన్న పార్టీనే ఉండనీయడం, వానికి సీట్ల సంఖ్య కొంచెం పెరగడం కనిపిస్తుంది. ఇది యథాతథముగా ప్రభుత్వస్థితికి ఇంకాస్త మద్దతు వంటి దయిందనాలి. కాంగ్రెసు కోల్పోయిన మేరకు ప్రతిపక్షాలు కొంత పుంజుకున్నాయనాలి. ఈరెండు నెలల్లో ఈ వ్యత్యాసానికి కారణాలు విశ్లేషిస్తే తలకొకరకం చెప్పుకునే అవకాశం ఉన్నదేగాని, ఇదమిద్ధంగా ఒకే కారణాన ఈ మార్పు వచ్చిందనడానికి అవకాశం కనిపించదు. కాకపోతే- ఒక కారణం చెప్పుకుంటే చెప్పుకోవచ్చు. లోక్‌సభ ఎన్నికల సమయానికి రాజీవ్‌గాంధీపై ఉన్న మోజు, జాలి వగైరాలు తగ్గిపోయినాయి. లేదా లోక్‌సభ ఎన్నికల్లో ఆలోచించిన తీరుకు, అసెంబ్లీ ఎన్నికల్లో ఆలోచించిన తీరుకు తేడా ఉందనాలి. కొందరు కేంద్ర నాయకత్వం మీద ప్రజలకున్న విశ్వాసం, రాష్ట్రాల నాయకత్వం మీద లేనందువల్ల ఈ ఫలితాలు వచ్చాయని భావించేవారు కనిపిస్తారుగాని, అది పెద్ద వాస్తవికంగా కనిపించదు. అప్పుడు కేంద్ర నాయకత్వాన్ని గురించి పెద్దగా తెలిసిందీ లేదు. ఇప్పుడు రాష్ట్రాల నాయకత్వాలను గురించి ఏదో తెలియక పోయిందీ లేదు. రాష్ట్ర నాయకత్వాలను గురించి తెలిసిన మాత్రం అప్పుడు కేంద్ర నాయకత్వాన్ని గురించి తెలియకనూ పోలేదు. అప్పటి ఫలితాలకూ ఏకగ్రీవమైన విశ్లేషణా లేదు, ఇప్పటి ఫలితాలకూ లేదు–అనాలి.

## పతనమైన ప్రమాణాలు

లోక్‌సభ ఎన్నికల్లోగాని, ఆతర్వాత అసెంబ్లీ ఎన్నికల్లోగాని ప్రచారాల ప్రమాణాలుమాత్రం విపరీతంగా అధ్వాన్నమయినాయి. ఈపతనం కనీసం 20 ఏళ్ళుగా సాగుతూ వచ్చి ఈ ఆఖరి ఎన్నికల్లో పరకాష్ఠ నందుకున్నదనాలి. ఎన్నికలంటే ఏవో కొన్ని సిద్ధాంతాలు, విధానాల విశ్లేషణ, అభ్యర్థుల మంచి చెడ్డలు, వాని ననుసరించుకొని ప్రచారాలు, స్వచ్ఛంద కార్యకర్తలు కృషి చేయడాలు ఆశించదగిన ప్రమాణాలు. రాను రాను అవన్నీ పోయినాయి. విధానాలతో నిమిత్తంలేని నిందలు తిట్టు కవిత్వాలతో, సారాయి మూకలను పెట్టుకొని డబ్బును దిమ్మరించడంలో పోటీగా ఆవేశకావేషాల్లో పోటీగా తయారయినాయి ఎన్నికలనేవి. ప్రజాసేవలో ఉన్నవారు ప్రజాసమస్యలను గురించి ప్రజలతో మాట్లాడు కోవడం గాక, సినీతారలు, తమాషాగాళ్ళు, కాలక్షేపాలు చేసే భణితులు పెచ్చుపెరిగాయి. ఇవన్నీ ప్రజల రాజకీయ విజ్ఞతను విచక్షణా శక్తిని పెంచేవి కావు. ఎడ్వర్‌టైజ్‌మెంటు దుమారాలతో సినిమాలను,

వ్యాపార సరుకులను చెలామణి చేసుకోవడంగా తయారైంది ఎన్నికలతంతు. ఇది ప్రజాస్వామ్యానికి మేలుగా తోచదు.

అసలు 1970 నుంచే ఎన్నికలనేవి కేవలం గాలివాటు వ్యవహారంగా తయారయినాయి. ఒక్కొకసారి ఒక్కొకగాలి, ఒక్కొక తరంగం. ఈ సారి మరీ అధ్వాన్నం. అమెరికా వాళ్లు రష్యా వాళ్లు లేదా మరొకరు రాజీవ్‌గాంధీని 'కాకా' పట్టే వ్యాఖ్యానాలు చేస్తే చేయవచ్చు. లేదా ఉమ్మడి ప్రజాభిప్రాయంలో దైవ సంకల్పాన్ని మనం చూస్తే చూడనూ వచ్చు, కాని ప్రజాస్వామికంగా తగిన ప్రమాణాలలోనే ఈ ప్రచారోద్యమాలు సాగాయని మాత్రం గుండె మీద చేయి వేసుకొని చెప్పలేం.

మిస్టర్ క్లీన్ లేదా పరిశుద్ధ శ్రీ అని ప్రచారం చేయబడుతున్న రాజీవ్‌గాంధీ ప్రచార సరళి చూస్తే- ఆయన స్వప్రయోజనాలకు అధికారాన్ని వినియోగించడంలోగాని, అసలు విషయాలు తప్పించి కేవలం "ఓట్లు ప్రోగు చేసుకొనే అల్ప రాజకీయాల్లో" గాని; అవకాశాన్ని బట్టి అబద్ధాలాడడంలోగాని, ప్రతి పక్షాలపై అన్యాయపునిందలు మోపడంలో గాని ఇందిరాగాంధీకి ఏమీ తగ్గడనేదే కనిపిస్తోంది. లేకపోతే ప్రతిపక్షాలకు దేశద్రోహులు అంట గట్టే స్థాయికి వెళ్ళడు. తన "అనుభవానికి", తన "దేశభక్తి"కి, తాను చేసిన "దేశ సేవ"కు, తన గతానికి, తన కథకు ఆయన - జాతికోసం జీవితాలను అర్పించిన పెద్దల, జాతీయ పక్షాల నాయకుల "దేశభక్తి" "దేశసేవ" "అనుభవాల"ను గురించి వ్యాఖ్యానాలు చేసే సాహసానికి దిగడు.

## అసత్యపు నిందలు

ఈ ఎన్నికల్లో జరిగిన మరొక ఘోరమేమిటంటే- అది ఘోరమైన సంఘటనలు సైతం ఎన్నికల సమస్యలు కాకపోవడం. శ్రీమతి గాంధీ హత్యను సొంత లాభానికి కాంగ్రెసు (ఐ) వాడు కోవడం వరకు జరిగింది. ప్రతిపక్షాల ప్రమేయం ఏ మాత్రం లేని ఆ విషాదం విషయంలో కూడా ప్రతిపక్షాలను విందించే హీనస్థితి మాత్రం కనిపించింది. కాని ఆ హత్య వెంటనే ఢిల్లీలోను మరి ఇతర చోట్ల కాంగ్రెసు అనుకూలురు జరిపిన వేలాది హత్యలు, దాని పై విచారణ జరిపించడానికి సైతం ప్రధాని నిరాకరించడం; దివాణంలోనే పాతికేళ్లుగా సాగుతున్న పరమ భయంకర గూఢచారి కుట్ర; పంజాబు, అస్సాం సమస్యల్లో ప్రభుత్వ అకార్మణత; రాష్ట్రాల వారీ కుంభకోణాలు; దశాబ్దాల కాంగ్రెసు పాలనలో ప్రతి రాష్ట్రంలోను చికాకులు, ప్రజానీకాన్ని వర్గాలు వర్గాలుగా చీలదీయడాలు- ఇలా ఏవీ ఏవీ ఏవీ ఎన్నికల విషయాలు కాలేదు. రాజీవ్ ప్రచారయంత్రాంగం సహజంగా అలా కానీయలేదు. ప్రతి పక్షాలకు సైతం వానిని ప్రజల ముందు ప్రస్ఫుటంగా ఉంచడం సాధ్యం కాలేదు. అన్ని ప్రతి పక్షాలు త్రోసి పుచ్చిన ఆనందపూర్ సాహిబ్ తీర్మానాన్ని ఒక్క అబద్ధంతో రాజీవ్‌గాంధీ ప్రతి పక్షాలమీద బురద చిందడానికి వాడడం జరిగింది. ఈ అబద్ధానికి వచ్చిన వ్యాప్తి, దాని జవాబుకు మాత్రం రాలేదు !

# దేశవాణి

## రాజీవ్‌కు ప్రజల జవాబు

కాకపోతే ఒక పని మాత్రం జరిగింది. కేంద్రంలో ఉన్న పార్టీని ఎన్నుకుంటేనే రాష్ట్రాలకు మేలు అనే రాజీవ్ గాంధీ వికృత సిద్ధాంతాన్ని, ప్రజలు పట్టించుకోలేదు గట్టిగానే త్రోసి పుచ్చారు. ఒక విధంగా అసెంబ్లీ ఎన్నికల్లో రాజీవ్‌గాంధీ ప్రచార నినాదం ఇక. 26 శాతం అదనపు బలంతో జనం దానిని త్రోసిపుచ్చడం ద్వారా జవాబిచ్చారు.

## సమాచార యంత్రాంగ స్థితి

ఎన్నికల సమయంలో చర్చింపబడి ఉండవలసిన ముఖ్యాంశాలు చర్చకే రాకపోవడానికి గల కారణాల్లో ఒకటి రెండు ప్రత్యేకంగా పేర్కొన దగి ఉంది. ప్రతి పక్షాలు అనైక్యతతో హీనస్వరంలో పడడం ఒక కారణ

మోతే, అంతకన్నా పెద్ద కారణం సమాచార సాధనాలు స్తంభించుకు పోవడం. పైగా అబద్ధాలకు పెద్ద ప్రచారం ఇవ్వడం. రేడియో, టి. వి. లు సరే పత్రికలు సైతం మున్నెన్నడు లేనంత హీన స్థాయిలో పడడం ఇటీవలి ఎన్నికల్లో పెద్ద విశేషం. అధికారంలో ఉన్నవారికి కొంత ఎక్కువ బాజా వాయించడం పత్రికల్లో కొంత మామూలు విషయమే అయినా, ఈసారి మరీ మోతాదు మించిందనిపిస్తుంది. అధికారవర్గానికి బాజా వాయించడమే గాక, అన్యవర్గాలవారిని తొక్కిపెట్టడంకూడా కనిపిస్తుంది. వార్తా సంస్థల వార్తల మీద ఆధారపడ్డ పత్రికలకు ప్రతిపక్షాల వార్తలే కరువయినాయి అనుకోవాలి. మొత్తం మీద పత్రికల్లో వార్తా విభాగం సంతులనం తప్పింది సరే - కనీసం అభిప్రాయప్రకటన భాగాల్లోనయినా కొంత స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం చాలా పత్రికల్లో కనిపించలేదు. ఏమిటీ అసత్యాలు ? అని అడిగిన పత్రికలు కనిపించవు. ఈ సమస్యల సంగతి ఏమిటి అని నిలవేసిన పత్రికలు కనిపించవు. ఎందుకు జరిగిందిలా ? కాంగ్రెసు (ఐ) పెద్ద ప్రకటనల పేరుతో రు. 3 కోట్లు పత్రికలకు ఆదాయం ఇచ్చిందన్నారు ప్రతిపక్ష నాయకులెవరో ? పత్రికలు (మినహాయింపులు లేకపోలేదు) ఇలా అయిపోవడానికి కారణం అదా ? కొంచెం తీవ్రంగా అందరూ ఆలోచించుకోదగిన విషయమిది. ప్రతి పక్షాలు పత్రికలకు సైతం విశ్వాసం కల్గించకపోవడం సరే- కాంగ్రెసు నయినా ఎందుకు చర్చించలేదు ?

## ప్రజల సంగతి

తరచు పార్టీలను, నాయకులను, పత్రికలను గురించి చర్చిస్తుంటాం గాని ప్రజలను గురించి చర్చించం. కాసేపు అదికూడా ఆలోచించుకోదగినవిషయమే. మనది రాజ్యాంగయుక్తమయిన ప్రజాస్వామ్యం గనుక, ఎన్నికల్లో ప్రజల అభిమతం శిరోధార్యం అనేది నిస్సందేహం. కాని ఆ అభిమతం లోని మంచిచెడ్డలు, దాని ఫలితాలు, అభిమత ప్రకటనలోని ఔచిత్యానౌచిత్యాల పరామర్శ చేసుకోవడం నేరం కాజాలదు. ప్రజల తీరుతెన్నులను గురించి చర్చించే సాహసం పార్టీలకుండదు. వారికి ఎలాగోలా ప్రజల ఓట్లు అవసరం గనుక ప్రజలను నొప్పించే వ్యాఖ్యలు చేసే సాహసం వారికి ఉండకపోవచ్చు. కాని ఓట్ల ప్రలోభం లేనివారయినా అలాంటి ప్రశ్న ప్రజల ముందుంచడం వాంఛనీయమేమో.

ఎన్నికల్లో పార్టీలు, అభ్యర్థులు గెలిచారు, ఓడారు అంటుంటారు. ఎవరూ ప్రజలు గెల్చారు ఓడారు అనరు ! ఎందువల్ల ?

ప్రజలు కోరేదేమిటి ? సంతులనం ఉన్న ప్రజాస్వామ్యం. అంటే ప్రభుత్వము, ప్రతిపక్షము ఉండే ప్రజాస్వామ్యం. తమ భావాలు ప్రతిబింబించే పార్టీలు, అభ్యర్థులు, ప్రజా ప్రతినిధుల సభల్లో ఉండడం; అవినీతి పరులు, ప్రజా కంటకులు, విదేశీ శక్తులు దుర్మార్గులు స్వార్థపరులు లేకుండా ఉండడం....ఇవే కదా. ఎన్నికల ద్వారా అవి సాధించుకోవాలి ప్రజలు. వోటు వారికి ఉన్న బలమైన సాధనం. తిరుగు లేని బలమైన సాధనం. మరి ఎన్నికల్లో ప్రజలు తాము కోరేది సాధించుకోలేకపోతే వారు గెల్చినట్లా ? ఓడినట్లా ? ఓట్ల అవసరంతో పార్టీలు, అభ్యర్థులు ఎన్నెన్నో మాటలు చెప్తారు. ఎత్తులువేస్తారు.

(తరువాయి 53వ పేజీలో)

# కాలుష్యాల మధ్య చదువులా?

నేటిసమాజంలో వాతావరణ, ధ్వనికాలుష్యాదులు నానాటికీ అధికమైపోతున్నాయి. ఈ కాలుష్యాలకు తోడుగా సాహితీ కాలుష్యం, రాజకీయ కాలుష్యాలు కూడా వ్యాప్తి చెందుతున్నాయి. ఇన్ని కాలుష్యాల మధ్య చదువెలా సాగుతుంది?

చాలా విద్యాలయాలు రైలు స్టేషన్లకీ, గూడ్సు షెడ్‌లకీ సమీపంలో వున్నాయి. ఆ విద్యాలయాలపై బొగ్గుమసి, రైలు ఇంజను పొగ సదా వాలుతూనే వుంటాయి. ఇంజను మోతలు, రైలు కూతలు తరగతుల్ని ఆక్రమించుకుంటూ వుంటాయి. కొన్ని విద్యాసంస్థలు రోడ్లకి ప్రక్కనే వుంటాయి. వచ్చే పోయే వాహనాల హారన్ల ధ్వనులు విద్యాసంస్థలలో ప్రతిధ్వనిస్తూనే వుంటాయి. ఈ మధ్య హారన్లమోత యుద్ధసమయాలలో పూర్వం కాహళ ఊదినట్టుగా వుండటంతో విద్యార్థుల కర్ణభేరులకి ప్రమాదకరంగా తయారవుతున్నాయి. ఇన్ని రణగొణ ధ్వనుల మధ్య, ఇంతటి ధ్వనికాలుష్యం మధ్య చిన్నారి బాలలు చదుకోవడం, అధ్యాపకులు పాఠాలు చెప్పడం గొప్ప సాహసకార్యాలు అనడంలో ఆశ్చర్యం ఏముంటుంది?

విద్యాలయాలు వాతావరణ కాలుష్యానికి కూడా గురవుతున్నాయి. మురికి కాల్వల సరసన, ఫ్యాక్టరీలు, మిల్లుల సరసన, శ్మశానాల ముంగిటకూడా కొన్ని విద్యాసంస్థలు నెలకొల్పబడ్డాయి. మలమూత్ర విసర్జనలకి దాపునవున్న పాఠశాలలూ లేకపోలేదు. కొన్ని పాఠశాలలు, ముఖ్యంగా ఎలిమెంటరీ పాఠశాలలు, పశువులకి నివాసస్థలాలుగా, విహారస్థలాలుగా వుంటున్నాయికూడా. అయినా భావిభారతపౌరులు ఆ పాఠశాలల్లోనే తయారవుతున్నారు!

సినిమా థియేటర్ల ప్రక్కనవున్న విద్యాలయాలూ వున్నాయి. తరగతి గదుల్లోకి సినిమా పాటలు వినబడుతూ విద్యార్థుల్ని ఆనందపరుస్తూ వుంటాయి!! కొత్త సినిమా విడుదలైనప్పుడు ఆ పాఠశాలకి సెలవు ఇచ్చినట్టే. సినిమా గురించి ప్రకటన చేస్తూ మైకు పెట్టి పాటలద్వారా జోరుగా ప్రచారం చేస్తారుకూడా. అయినా ఉపాధ్యాయులు, బాలబాలికలు 'చదువుల తల్లి'ని శాయశక్తులా కొలుస్తూనే వున్నారు.

ఇక రాజకీయాల సంగతి సరేసరి. విద్యార్థి సంఘ ఎన్నికల పాపమా అని రాజకీయాలు సరాసరి సింహద్వారం నుంచే విద్యాలయాలలోకి ప్రవేశిస్తున్నాయి. గోడలన్నీ ఖరాబు చేస్తున్నాయి. ఇవి చివరికి ఉపాధ్యాయుల్నీ వలలో పడేస్తున్నాయి. విద్యాసంవత్సరాన్ని అస్తవ్యస్తం చేస్తున్నాయి. బుద్ధిగా చదువుకొనేవారికి ఆటంకాలవుతున్నాయి.

చివరగా అవినీతి కాలుష్యం గురించి ముచ్చటిస్తాను. జీతాల కోసం, గ్రాంటుల కోసం, పి. ఎఫ్. కోసం, పెన్షన్ కోసం అవినీతిగా పయనిస్తేగాని చేతికిదక్కవు. విద్యార్థులు మార్కుల కోసం, స్కాలరుషిప్పుల కోసం, సర్టిఫికెట్లకోసం....ఇంకా కొన్ని పనులు కోసం చేతులు తడపకా తప్పటంలేదు.

ఇన్ని కాలుష్యాల మధ్య 'చదువు' సాగుతున్నందుకు మన విద్యార్థుల, అధ్యాపకుల సహనశీలానికి అభినందనాలు! అభినందనాలు!!

— ద్వా. నా. శాస్త్రి

"ప్రేమలేని శరీరం స్మశానంలోని శవంతో సమానం. కంచరివాని తోలుతిత్తి ప్రాణం లేకపోయినా శ్వాస తీసుకుంటూనే వుంటుంది."

— కబీర్

రెండు నిమిషాల్లో నౌకరు ఒంటరిగా తిరిగొచ్చాడు.

" బాబేడీ?" ముఖం చిట్లించింది చందన.

"గదిలో పడుకుని తలుపు వేసుకున్నారమ్మా! ఏదో అలిగినట్లున్నారు" నవ్వుతూ అన్నాడు నౌకరు.

"వాళ్ళ నాన్నగారొచ్చారని చెప్పావా?"

"ఆ...చెప్పాను!..."

16 సీరియ

రావినూతల సువర్ణాకన్నన్

" ఇన్నాళ్ళూ తనని చూడ్డానికి రానందుకు మీ మీద కూడా కోపం వచ్చినట్టుంది!" నవ్వింది చందన.

"నిజమే! బాబు వట్టి అల్లరివాడు!" తమ ఊళ్ళో తను రావడం కాస్త ఆలస్యం అయితే... వాడు చేసే హంగామా గుర్తొచ్చిన జయంత్ కూడా నవ్వుతూ అన్నాడు.

"రండి! మీరే బతిమాల్దురుగాని!" అంటూ చందన బాబు గదికేసి నడిచింది. జయంత్ లేచాడు.

బాబు గది తలుపు తడుతూ -

"బాబూ! మీనాన్నగారొచ్చేశారు! తొందరగా రావాలి!" ఉత్సాహంగా అంది చందన.

బాబు తలుపు తియ్యలేదు.

"ఇది బాబు గదా?" ఏదో ఆలోచిస్తూ అన్నాడు జయంత్.

"అవును సాధారణంగా ఇందులోనే పడుకుంటాడు, ఆడుకుంటాడు. రాత్రిపూట మాత్రం ఈమధ్య నాన్న గారి దగ్గర పడుకుంటున్నాడు !.... నిన్నా, ఇవాళా మీ గురించి మరీ కలవరిస్తున్నాడు !" అని మళ్ళీ తలుపు తట్టింది చందన.

బాబు తలుపు తియ్యలేదు.

"బాబూ !" బిగ్గరగా పిల్చాడు జయంత్.

బాబు పలకలేదు.

"బాబూ!.... నువ్వు తలుపు తియ్యకపోతే మీనాన్న వెళ్ళిపోతారు!" బెదిరించింది చందన.

అయినా వాడు తలుపు తియ్యలేదు.

జయంత్ కళ్ళు చిత్రంగా ముడుచుకున్నాయి. "గడియ వాడికి అందుతుందా?" అన్నాడు అనుమానంగా.

నిజమే! అన్నట్టు ఆలోచనలో పడింది చందన.

"అందకపోతే ఎలా వేసుకుంటాడు ?" అన్నారెవరో.

కంగారుగా తలుపు బాదింది చందన. ఫలితం శూన్యం!

ఈ అలజడికి అంతా అక్కడికి చేరారు.

రాఘవ కిటికీలోంచి చూశాడు.

కిటికీ తలుపులుకూడా వేసున్నాయి.

ఇలా కాదని ఏదో తీగతో అతి ప్రయాసపడి తలుపు గడియ తీశాడు.

అందరూ వెల్లువలా గదిలోకి పరిగెత్తారు.

చిత్రం !

బాబు గదిలో లేడు !

గుండె ఝల్లుమంది చందనకి. కంగారుగా జయంత్ కేసి చూసింది. అతని కళ్ళు....

"బాబు ఏడీ!" అని ప్రశ్నిస్తున్నాయి.

జరిగిన కథ :

మురళితో చందన పెళ్ళి ఒక పసివాడి కారణంగా ఆగిపోతుంది. శాంతారాంగారికి హార్ట్ఎటాక్ వస్తుంది.

చందనని "అమ్మా" అంటూ ఆ ఇంట చేరిన బాబుని దండించబోయిన చందన, ఆమె మేనమామ రాఘవ, బాబు చేతిలోని ఫోటో చూసి నిర్ఘాంత పోతారు.

బాబు ఇంట్లో అందరికీ చేరిక అవుతాడు, ఒక్క చందనకి తప్ప. చందన అంగీకారంతో తను, మురళి కాశ్మీర్ వెళ్ళి కొన్ని సంగతులు తెలుసు కోవాలనుకుంటాడు రాఘవ.

పేపర్లో బాబుని గురించిన ప్రకటన చూసిన చందన అందులోని య్రాడస్‌కి ఫోన్ చేస్తుంది. బాబు తండ్రి జయంత్ వస్తాడు. చందన అతనికి విషయం వివరించి, తండ్రి ఆఫీసునించి అతన్ని ఇంటికి తీసుకొస్తుంది. బాబుని తీసుకురమ్మని నౌకర్‌కి పురమాయిస్తుంది.

(ఇక చదవండి)

"ఇక్కడే వుండాలి మిష్టర్ జయంత్ !".... వణుకు తున్న గొంతుతో అంది.

"ఇక్కడే వుంటే ఏమౌతాడు?"

"అదే అర్థం కావడంలేదు." అంటూ ఇల్లంతాకలియ తిరిగింది చందన, ఆమెతోపాటు అంతా వెదికారు. అయితే బాబు జాడమాత్రం లేదు.

"బాబు పారిపోయాడు" అన్నారెవరో.

"ఎలా పారిపోతాడు? లోపల గడియ వేసుందిగా?" అన్నారు మరొకరు.

"నో! బాబు పారిపోడు! ఎంత బతిమాలినా అమ్మ నొదిలి వెళ్ళనన్న బాబు హటాత్తుగా ఎందుకెళ్ళిపోతాడు? అదీ తండ్రి వస్తున్నట్టు తెలిశాక!...." అన్నాడు శాంతా రామ్.

అందరికీ అయోమయంగా వుంది.

చందనకైతే కాళ్ళల్లోంచి ఒణుకొస్తోంది. జయంత్ కేసి చూడాలంటేనే భయంగా ఉంది.



"వాడినెవరో ఎత్తుకు పోయారు!" హటాత్తుగా అన్నాడు రాఘవ.

"మావయ్యా!" కంగారుగా అంది చందన.

"అవును చందనా!.... వాడు ఖచ్చితంగా పారిపోయి వుండడు!.... మనం వెంటనే వెతక్కుండా లోపలున్నట్టు భ్రమ కలిగించి తెలివిగా ఎత్తుకుపోయారు."

"ఎందుకు?" తడారిన గొంతుతో అంది చందన.

"ఏమో! అది సరిగ్గా మనం ఊహించలేం! వాణ్ణి .... తీసుకొచ్చిన వాళ్ళచెయ్యే ఇందులో ఉందని నానమ్మకం!"

"కానీ మనింట్లోకొచ్చి...."

"తెలివిగా నీ ఫొటో తీసిన వాళ్ళకిదోలెఖ్ఖకాదు!" గంభీరంగా అన్నాడు రాఘవ.

"బహుశా.... ఇదంతా.... ఆ 'అంకుల్' అన్నవాడి పనేమో!" అన్నాడు శాంతారామ్.

జయంత్ మొహం కఠినంగా అయిపోయింది.

"ఏమిటీ నాటకం?" అన్నాడు ఆవేశంగా.

అందరూ కొయ్యబారిపోయారు అతని మాటలకి.

చందనకి ఏడుపు కూడా వచ్చేస్తోంది.

"చెప్పండి!.... బాబునేం చేశారు?" గద్దించినట్టే అన్నాడు.

"లేదు జయంత్‌గారూ!.... నిజంగా బాబు ఇక్కడే వుండాలి!.... కానీ...."

"చాలా బావుంది డ్రామా!.... కానీ.... నమ్మేలా మాత్రం లేదు!" వ్యంగ్యంగా అన్నాడు జయంత్.

"అంటే.... మేమే మీ అబ్బాయిని దాచేసి ఇలా అంటున్నామంటారా?" సీరియస్‌గా అన్నాడు రాఘవ.

"ఎందుక్కాకూడదు?"

"దానివల్ల ప్రయోజనం?"

"నువ్వుండు మావయ్యా!.... ఇదిగో జయంత్‌గారూ! నిజంగా మీ బాబుని దాచే ఉద్దేశమే మాకున్నట్టయితే.... మీకు పనివేళా ఫోన్‌చేసి ఎందుకు పిలిపిస్తాం చెప్పండి!" అనునయంగా అంది చందన.

"అదీ ఒక నాటకమే అవచ్చు!" నిర్లక్ష్యంగా అన్నాడు జయంత్.

"మిష్టర్ జయంత్!.... హద్దులు మీరుతున్నారు! ఒకళ్ళ పిల్లల్ని దాచే హీనస్థితిలో ఈ కుటుంబం లేదు! ఈ కుటుంబానికున్న గౌరవమర్యాదలు మీకు తెలియవు!" ఆవేశంగా అన్నాడు రాఘవ.

"తెలియకేం!.... బ్రహ్మాండంగా తెలుసు!.... పసివాణ్ణి అడ్డం పెట్టుకుని ఎన్ని నాటకాలైనా ఆడతారనికూడా తెలుసు!.... అయినా మీతో నాకు వాదనలేమిటి .... ఇదంతా పోలీసులే తేలుస్తారు!" విసురుగా వెళ్ళబోతున్న జయంత్‌ని ఆపేసింది చందన.

‘‘ప్లీజ్! మిష్టర్ జయంత్! మీరు తొందరపడకండి. మీ బాబుని మీకప్పజెప్పే బాధ్యత మాది!” బ్రతిమాలుతూ అంది.

శాంతారామ్, భార్య కూడా బ్రతిమాలడంతో కాస్త కూలయ్యాడు జయంత్.

‘‘ఇదిగో! నేను బైటికెళ్ళి మళ్ళీ రాత్రికొస్తాను. ఈలోగా నా కొడుకు జాడ తెలియాలి! లేకపోతే విషయం చాలాదూరం వెళ్తుంది!” అంటూ విసురుగా బైటికెళ్ళిపోయాడు.

కుప్పకూలిపోయింది చందన.

శాంతారామ్‌కి మళ్ళీ ఆరోగ్యం ఎక్కడ దెబ్బతింటుందో అన్న కంగారుతో ఆయన్ని గదిలోకి తీసికెళ్ళి ధైర్యం చెప్పారు భార్యా, బావమరిది.

నౌకర్లు చెవులు కొరుక్కున్నారు.

* * *

“మావయ్యా!”

తన గదిలో కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్న రాఘవ చందన పిలుపుకి తృళ్ళిపడి చూశాడు.

‘‘ఏంచేస్తున్నావ్?” లోనికొస్తూ అంది చందన.

“చెయ్యడానికేవుందీ.... మనకి పట్టిన గ్రిహణం ౦రించి ఆలోచిస్తున్నాను!’’ ఆదోలా అన్నాడు రాఘవ.

‘‘ఏం చేద్దాం మావయ్యా!.... నాన్నకి మళ్ళీ హైటాక్ ఎక్కడ వస్తుందో అని భయంగా ఉంది!’’ టనీరు తిరుగుతూండగా అంది చందన!

“కూర్చో!’’ అన్నట్టు చూసి మౌనంగా వుండిపోడతను. అతనికీ భయంగానే ఉంది.

‘ఎవరు చేసుంటారంటావీపని?” కూర్చుని మెల్లగా ఆ చందన.

అది తెలిస్తే ఇంక గొడవేవుంది?”

నాకొకటనిపిస్తోంది!”




“ఏవిటి?’’ ఆతృతగా అడిగాడు రాఘవ.

‘‘మన ఇంట్లోంచి బాబుని ఎవరో బలవంతంగా తీసికెళ్ళారు!.... అవునా?”

‘‘అవును! అలాగే అనుకోవాలి!.... ఎందుకంటే వాడుగా వెళ్ళలేదు, వెళ్ళడు గనుక!”. స్థిరంగా వుందతని గొంతు.

“అందుకే నాకో అనుమానం వచ్చింది!’’

‘‘ఏవిటి?”

“ఈ పని మనవాళ్ళే ఎవరో చేసుంటారని!’’

‘‘చందనా!” తృళ్ళిపడ్డాడు రాఘవ.

“అవును మావయ్యా!.... నాకలాగే అనిపిస్తోంది. అంటే.... కేవలం మనవాళ్ళు చెయ్యకపోయినా మనవాళ్ళ సహాయం ఖచ్చితంగా ఉండివుంటుంది! లేకపోతే బాబు సంగతీ, బాబు ఆ గదిలో వుంటాడన్న సంగతీ ఎవరికీ తెలియదు. పైగా అంతధైర్యంగా పరాయివాళ్ళు మనింట్లోకి రాలేరుకూడా!’’ అంది చందన.

‘‘నిజమే!’’ అన్నట్టు తల పంకించాడు రాఘవ.

‘‘వంటమనిషితో సహా పన్నెండు మంది సర్వెంట్స్ వున్నారు. అందర్నీ పిల్చి అడుగుతాను!’’ కాస్త ఆవేశంగా అంది చందన.

"తక్కువ మాట్లాడండి. ఎక్కువ సాధిం చండి. మర్యాదగా మాట్లాడటానికి, పొగడ్త కున్న తేడాను గ్రహించండి. 'విప్లవం, విప్లవం' అని కేకలు వేయకండి. ఆ కేకలు వేసే నాయ కులు కార్యాచరణకు వెనుకంజవేస్తారు. దేశంలో నాయకులకు కొదవలేదు. క్రమశిక్షణా శీలురైన అనుచరులు లేనిదే పోరాటంలో విజయం చేకూ రదు. కాన అట్టి సైనికులుగా తయారుకండి."

పల్లభాయిపటేల్

"ఏమని?"

"బాబు సంగతి చెప్పమని!"

"వాళ్ళు చెప్తారా?"

"చెప్పిస్తాను!" కఠినంగా అంది చందన.

"సరే ప్రయత్నించు!" నీరసంగా అన్నాడు రాఘవ. అతనికి జయంత్ అన్నమాటలే చెవుల్లో ప్రతిధ్వనిస్తు న్నాయి. అతను ఎవరిచేతా పల్లెత్తు మాట పడడు. చందనసంటే అసలు సహించలేడు.

"ఇప్పుడు జయంత్ వచ్చి నిలదీస్తే ఏం చెప్పాలి?" అన్నట్టు.... దిగులుగా వుండిపోయాడు.

ఇద్దరూ బాబుని గురించి, అతని తండ్రి వస్తే ఏం చెప్పాలి.... అని చర్చించుకున్నారు చాలా సేపు.

"ఇది కచ్చితంగా ఆ అంకుల్ అన్నవాడిపనే" అన్న నిర్ణయానికొచ్చేశారు.

రాత్రి తొమ్మిది దాటుతుండగా వచ్చాడు జయంత్. అతన్ని చూసి పామును చూసినంతగా బెదిరిపోయింది చందన.

ఆమె ముఖాన్ని చూసి బాబు జాడ తెలియలేదని గ్రహించాడతను. మొహంనిండా నీలినీడలు ఆక్రమిం చేశాయి.

"పోలీసు కంప్లెయింట్ ఇద్దాం!" గంభీరంగా అన్నాడు.

"మిస్టర్ జయంత్!.... ఒక్కమాట!" చిన్నగా అంది చందన.

"చెప్పండి!"

"మానాన్నగారికి హార్టెటాక్ వచ్చి ఎంతోకాలం కాలేదు. మీకు తెలుసుగా?.... జరిగిన అవమానాన్నింకా మర్చి పోనేలేదు.... ఇప్పుడు.... పోలీసులు వాళ్ళూ వసే" ఆమె గొంతు వణికింది.

"మరెలా...."

"కాస్త ఓపిక పట్టండి! ... బాబుని ఎంత కష్టపడైనా, ఎంత డబ్బు ఖర్చుపెట్టయినా వెతికి మీకప్పచెప్తాను!.... ప్లీజ్ నా మాట నమ్మండి!"

"అయితే నన్నేం చెయ్యమంటారు?" కాస్త విసుగ్గా అన్నాడు జయంత్.

"మీరేం చెయ్యద్దు!.... నాన్నతో కాస్త శాంతంగా మాట్లాడండి! ఆయనకాస్త ధైర్యం వస్తుంది!" ప్రాధే మాలుతున్నట్టు అంది చందన.

పరిస్థితి అర్థంచేసుకున్న జయంత్ మౌనంగా వుండి పోయాడు అంగీకారంగా.

"థాంక్యూ! థాంక్యూ మిస్టర్ జయంత్! రండి! నాన్న దగ్గరికెళ్దాం!" ఆనందంగా అంది చందన.

ఇద్దరూ కలిసి శాంతారామ్ గదిలోకెళ్ళారు. ఆయ మొహం పది లంకణాలు చేసినట్టుంది.

"మీరేం బాధపడకండి!.... బాబు ఈ ప్రాంతాల్లో వుండి వుంటాడు!" ఆయనతో అన్నాడు జయంత్.

శాంతారామ్ మొహం తేరుకుంది. దిగులు మంం చినట్టు మాయమైంది.

ఆయనకి జయంత్ వచ్చి ఎక్కడ యాగీ చేస్తాడోని భయంగా వుంది. ఇప్పుడతనే ధైర్యం చెప్తుంటే ప్కు టన్నుల బరువు తలమీంచి దించినట్టయింది.

చాలా సేపు లేని ఉత్సాహం నటించి కబుర్లు చెప్పారు చందనా, జయంత్‌కూడా.

కృతజ్ఞతగా జయంత్‌కేసి చూసింది చందన.

"అయితే.... ఇంక నేను వెళ్ళిపోతాను....బాబు కని పించగానే ఫోన్ చెయ్యండి।.... నాక్కావిపిస్తే నేను చేస్తాను।'' అన్నాడు జయంత్.

"జయంత్!.... మీరు కార్ల బిజినెస్ చేస్తారా." హటాత్తుగా అడిగాడు శాంతారామ్.

''లేదు! ఏం?"

"మాకు చాలా రకాల కార్లున్నాయి! మానాన్న రోజుకో కార్లో తిరుగుతాడు, అని బాబు చెప్పాడు!"

"ఓ అదా!'' చిన్నగా నవ్వాడతను.

కుతూహలంగా చూశారు అంతా.

''నేను కావడానికి ఓ ఇంజనియర్ని. చిన్న వర్క్‌షాప్ లాంటిది పెట్టుకుని రన్ చేసుకొంటున్నాను. నా దగ్గరికి రకరకాల కార్లు రిపేరుకొస్తాయి కదా.... వాటినే బాబు మావనుకున్నట్టున్నాడు!.... కార్లు ఎవరివో తెలియదు, కార్లలో నేను తిరగడమే వాడికి తెలుసు।'' భారంగా అన్నాడు జయంత్.

''మిష్టర్ జయంత్!.... మీకు విరోధులెవరైనా....''

"నాకు తెలిసినంతవరకు ఎవరూ లేరు।'' శాంతారామ్ మాటలు పూర్తికాకుండానే అన్నాడు జయంత్.

''మీ దగ్గర డబ్బు గుంజడానికెవరైనా బాబుని కిడ్నాప్ చేసుంటారేమో।....''

"కావచ్చు!.... అయినా ఆ సంగతి నాకు తెల్పాలిగా. అదీగాక.... పిల్లాణ్ణి దాచి డబ్బు గుంజేంత లక్షాధికార్నీ కాదు నేను!...."

''కానీ....'' అనుమానంగా చూశాడు శాంతారామ్.

ఏదో స్ఫురించిన జయంత్ చిన్నగా నవ్వుతూ....

''బాబు మాకు బ్రహ్మాండమైన భవంతి, దాన్నిండా నౌకర్లు వగైరాలుంటారని కూడా చెప్పాడా?" అన్నాడు.

''అవును।'' అన్నట్టు తలూపాడు శాంతారామ్.

"అదీ మాదికాదు!.... మేం ఓ డాక్టర్‌గారింట్లో ఉంటున్నాం. ఆయన మా నాన్నగారి స్నేహితులు. అందుకే వారి గెస్ట్‌హౌస్ మాకిచ్చారు.'' వివరించాడతను.

"అయితే.... ఆ ఫోన్....?" మెల్లగా అంది చందన.

''అదీ వారిదే। ఆరోజు మీతో మాట్లాడింది డాక్టర్ గారమ్మాయి కాంచన.''

''ఓ!'' నవ్వేశారు శాంతారామ్, చందన.

''మరి నేను వెళ్తాను!'' అన్నాడు జయంత్.

మళ్ళీ అందరి హృదయాలూ బరువుగా అయిపోయాయి.

''మిష్టర్ జయంత్?.... ఒక్క రెండురోజులుండండి! ప్లీజ్!.... బాబుజాడ తెలుసుకోవడానికో ప్లాన్ వేశాను. అది సక్సెస్ అవుతుందనే నా నమ్మకం!" రిక్వెస్ట్ చేసు కున్నట్టు అంది చందన.

శాంతారామ్, దేవకి కూడా మరీమరీ చెప్పడంతో 'సరే' అనేశాడతను.

* * *

చందన గదిలో విసురుగా పచార్లు చేస్తోంది. ఒక్కొక్కరుగా వచ్చి ఒదిగొదిగి నిల్చున్నారు పనివాళ్ళంతా. అందరి ముఖాల్లోనూ భీతి కనిపిస్తోంది.

ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూండే చందన అంత గంభీరంగా ఉండడంతో ఎవరికీ నోట మాటరావడంలేదు। ఆమెని పలకరించడానికీ ధైర్యం చాలడం లేదు.

''అంతా వచ్చారా?" గంభీరంగా అంది చందన.

''ఆ! వచ్చావమ్మా!'' అన్నారు ఏక కంఠాన.

''తలుపు వెయ్యండి।"

తలుపులు మూసుకున్నాయి.

''మిమ్మల్నెందుకు పిలిచానో తెలుసా?'' సూటిగా చూస్తూ అంది చందన.

''తెలియదు'' అన్నట్టు తలలూపారు.

## కాబూలి – బాకీ

— జీసనారా

భగవంతుని దగ్గర బాకీపడ్డాను
జీవితం 'అప్పు' తీసుకుని !
కాపలాగా తన ప్రతినిధి
'కాంత'ను భరించమన్నాడు !
వడ్డీ కింద పిల్లల్ని కని
ముద్దుగా పోషించమన్నాడు !
ఇక్కడ చేసిన అప్పులే
ఏనుగంత పెరిగితే
భగవంతుని అప్పు తీరలేక;
బాల్చీ తన్నేశాను !
పరమాత్ముడు 'కాబూలీ' !
మరల పంపాడు భువికి,
అప్పు తీర్చడం ఎలాగో
చెప్పలేదు ఇంతవరకూ !...

"అయితే జాగ్రత్తగా వినండి! మనం ఇంతమందిమి వుండగా పట్టపగలు బాబు ఈ ఇంట్లోంచి మాయమయ్యాడు!.... వాడు పారిపోడని, పారిపోలేడని మనందరికీ తెలుసు..... కానీ.... బాబు వెళ్ళిపోయాడు:.... కాదు ఎవరో ఎత్తుకుపోయారు తెలివిగా ప్లానేసి!....

అయితే....ఈపని బైటివాళ్ళకి సాధ్యం కాదు!.... మీలో ఎవరో ఆ ద్రోహులకి సహాయం చేసుండాలి:.... బాబు మాయం అవడం మీలో ఎవరికో ఖచ్చితంగా తెలిసుండాలి:

అందుకే మంచిగా అడుగుతున్నాను చెప్పండి!.... "ఎవరు బాబు మాయమవడానికి కారకులు:" కఠినంగా అడిగింది చందన.

ఒణికిపోయారంతా.

ఒకర్నొకరు అనుమానంగా చూచుకున్నారు.

"చెప్పండి!.... ఇప్పుడు చెప్పలేకపోతే రేపు రాత్రి దాకా గడువిస్తున్నాను. నా గది తలుపులు తీసే వుంటాయి. మీరెప్పుడైనా వచ్చి చెప్పచ్చు: అలాచెప్తే వార్ని క్షమించి వదుల్తాను. లేదంటే పోలీసుల్ని పిలిపించి.... వాళ్ళచేతే నిజం రాబట్టిస్తాను. కానీ అంత దాకా రానీకండి:.... బాగా ఆలోచించి చెప్పండి.

పోలీసులు నాలా ఇంత మర్యాదగా అడగరు!....చాలా కఠినంగా అడుగుతారు! అవసరం అనుకుంటే ఆడవాళ్ళని కూడా చూడకుండా ఒళ్ళు హూనం చేస్తారు:.... బాగా ఆలోచించి ఏం చేస్తారో చెయ్యండి!.... ఊఁ! ఇంక వెళ్ళచ్చు:" అంది చందన.

తలుపు తీసుకుని ఎవరో తరుముతున్నట్టు పారిపోయారంతా.

ఆ రాత్రంతా ఆతృతగా ఎదురుచూసింది చందన ఎవరైనా వచ్చి బాబు విషయం చెప్తారేమో అని. అయితే తెల్లవారింది గానీ ఎవరూ రాలేదు. పైగా పొద్దున అందరూ ఆమెని తప్పించుకు తిరగడం మొదలుపెట్టారు.

చందన, రాఘవ, శాంతారామ్, దేవకీ.... గంటల తరబడి ఆలోచించారు. అయితేవాళ్ళకీ దారి కనిపించలేదు.

చందన ఆశ పూర్తిగా అడుగంటిపోయింది. ఎవరో వచ్చి చెప్తారన్న నమ్మకం తుడిచిపెట్టుకుపోయింది.

ఇప్పుడేం చెయ్యాలి: పోలీస్ కంప్లెయింట్ ఇవ్వక తప్పదా:.... ఒకవేళ వాళ్ళు బాబునేం చేసుండరుకదా: ఇలా భయంకరమైన ఆలోచనలొస్తున్నాయామెకి.

*　　*　　*

అర్ధరాత్రి ఒంటిగంట కావస్తోంది. అప్పుడే కునుకు పట్టింది చందనకి.

హఠాత్తుగా ఎవరో కొట్టినట్టు ఉలిక్కిపడి లేచింది.

కాళ్ళదగ్గర ఎవరో మనిషి:

చిరువెలుతురులో ముసుగులోవున్న వ్యక్తి.

భయంతో చమటలు పట్టాయామెకి.

"ఎవరు" గభాల్న లేచి నిల్చుంది.

( స శే ష ం )

# అనుభూతిని అందించేది, రసానుభూతిని ప్రసాదించేది, హృదయాన్ని కదిలించేది - "కవిత"

కళలు ప్రధానంగా మూడు వర్గాలకు చెందుతాయి. సంగీతం చెందుతుంది శ్రవ్యకళకు; చిత్రం, శిల్పం, వాస్తు మొదలైనవి దృశ్యకళకు; ఇక మూడవదైన శ్రవ్యదృశ్యకళకు చెందుతాయి నాటకం, నృత్యం మొదలైనవి.

అయితే, కవిత ఏ కళకు చెందుతుంది ? పైన తెలిపిన ఏ వర్గానికీ అది చెందదు, లేక అన్ని వర్గాలకు చెందు

కవితను చూచి చదవ వచ్చు, పైకి వినిపించకుండా తనలో తాను. అప్పుడది దృశ్యకళ అవుతుంది. చదవకుండా కవితను పాడవచ్చు. అప్పుడది శ్రవ్యకళ అవుతుంది. దాన్ని చూచి పాడుతున్నపుడు అది శ్రవ్యదృశ్య కళ అవుతుంది. దాన్ని చూడకుండా పాడకుండా, తనకు కంఠస్థమైన కవితను మనసులో మౌనంగా అనుకోవచ్చుకూడ. ఆ తరుణంలో కవిత ఏకళ అవుతుంది ?

అపుడది అశ్రవ్యఅదృశ్య కళ అవుతుంది.

ఇన్ని విధాలుగా వ్యక్తం కాగల కళ కవితాకళ; ఇది శ్రవ్యకళగాను, దృశ్యకళ గాను, శ్రవ్యదృశ్య కళగాను, శ్రవ్యం, దృశ్యం కాని కళగాను రూపొందుతుంది. దాని రూపొందించే విధాన్ని బట్టి దాని వర్గీకరణ ఏర్పడుతుంది.

ఒక సంశయం, కవితను చూస్తూ చదువుతున్నప్పుడు అది దృశ్యకళ అనిపించుకోదేమో ! కారణం ఆ కవితను చదువుతున్న మనం దాని లిఖిత స్వరూపమైన అక్షరాలను చూచి ఆనందించం, దాని పదాల శ్రవ్యతనూ, ఆ పదాలు వ్యక్తపరచే విషయాన్నీ, భావాలనూ ఆనందిస్తాం.

కనుక కవిత దృశ్యకళ కాదు.

చిత్రకళ, శిల్పకళ ఎందుకు దృశ్యకళలు అయినాయంటే, వాటి రూపాలనూ, రంగులనూ చూచి మనం ఆనందిస్తాం. దృశ్యకళల్లో దృశ్యమానమైన రూపం మొదటిది, అది వ్యక్తపరచే విషయం తరువాతది.

కవితాకళ ఇందుకు వ్యతిరేకమైంది. కవితలో విషయం కాని, భావంకాని మొదటిది, రూపం రెండవది. మరో సత్యం ఏమంటే చిత్రపు రూపం అంటే మన కంటికి కనిపించే రేఖలూ రంగులూ. కనుక చిత్రకళారూపం దృశ్యమానం.

కనుక అది పూర్తిగా దృశ

డా॥ సంజీవదేవ్

కవిత సందర్భంలో ఈ సత్యం వర్తించదు. కవితకు రూపం అంటే దృశ్యమానమైంది కాక శ్రవ్యమానమైంది మాత్రమే. పదప్రయోగం, వాటి కూర్పు మొదలైనవి కవితకు రూపం. ఆ రూపం అభివ్యక్త పరుస్తుంది విషయాన్నీ, భావాన్నీ.

కాబట్టి కవితను చూస్తూ చదువుతున్నా కూడ అది దృశ్యకళ అనిపించుకోదు. చూస్తూ చదువుతున్నాకూడ అందులో చదవటం అనేది ప్రధానమే కాని చూడటం కాదు.

కవితను చూడకుండాకూడ చదివి ఆనందించవచ్చు.

చిత్ర, శిల్ప విషయాల్లో అది సందర్భపడదు. వాటిని చూడంది ఆనందించజాలం.

అందుకే అనేది కవిత దృశ్యకళ కాదని. దాన్ని చదువుతున్నా, పాడుతున్నాకూడఅది శ్రవ్యమే అవుతుంది. ఇక దాన్ని చూడకుండా, చదవకుండా, పాడకుండా మనసులోనే

## వివేకం

కోపంగా ఒకరు ప్రశ్నించేటప్పుడు శాంతంగా సమాధానం చెప్పినా, వారి కోపం ఎక్కువవుతుంది. కోపంగా సమాధానమిస్తే వారికోపం మరింత ఎక్కువవుతుంది. కాబట్టి నోరు మెదపకుండా ఊరుకోవడం వివేకవంతుని లక్షణం.

అనుకొంటున్నప్పుడు అది కనిపించని, వినిపించని ఒక విశిష్ట కళ మాత్రమే అవుతుంది !

కవితను ఒకప్పుడు పాడటానికి రచించేవారట; తరువాత చదవటానికి రచించసాగారట; నేడు ఆలోచించటానికి రచిస్తున్నారు కవితను.

మొదటిదానిలో కవితకు గానకళతో సంబంధం; రెండవ దానిలో గానంకాని పఠనం; మూడవ దానిలో గానం లేదు, పఠనం లేదు, ఉన్నదల్లా మౌన ఆలోచనయే.

చిత్రకళ ప్రధానంగా సారూప్యకళ (Representational art). ఒక చెట్టురూపం చిత్రంలో ఉంటే అది ప్రకృతిలోని ఏదో చెట్టుతో సారూప్యాన్ని కలిగి ఉంటుంది, నైరూప్య చిత్రాల్లో తప్ప.

కవిత ప్రధానంగా భాషా నిర్మితం కనుక అది ప్రతీకాత్మకమే కాని ప్రతిమాత్మకం కాదు. ఒక వస్తువుకూ, ఆ వస్తువును తెలిపే పదానికీ ఏమాత్రం పోలిక ఉండదు. దేని దారి దానిదే.

కొండ అనే పదానికీ కొండ అనే వస్తువుకూ ఏ పోలికా లేదు. కొండ అనే పదాన్ని అరంగుళం స్థలంమీద వ్రాయవచ్చు; కొండ అనే వస్తువుకు మైళ్ళ మైళ్ళ స్థలం కావాలి.

అదే విధంగా వస్తువులూ, వాటి పేర్లూ.

అందుకే భాష ప్రతీకాత్మకం. ప్రతీక వేరు, ప్రతిమ వేరు. ప్రతిమను గుర్తించి అది ఫలానిది అని చెప్పవచ్చు, కాని ప్రతీకను గుర్తించజాలం. అన్నిటిలో వలెనే దీనిలో కూడ స్వల్పంగా అపవాదాలుండవచ్చు.

ఇంతకూ కవిత ఏకళకు చెందుతుందనే ప్రశ్నకు సుస్పష్టమైన సమాధానం దొరకలేదు. కనుక వాడుకలోఉన్న శ్రవ్యకళకు కాని, దృశ్యకళకు కాని, ఈ రెంటి సమ్మేళనమైన శ్రమ కళకుకాని చెందదు.

కనుక కవిత ఏ ఇతర కళలకూ చెందదు.

కవిత కవితాకళకు మాత్రమే చెందుతుంది !

కవిత అంటే ?

అందమైన వస్తువును గురించి అందంగా చెపుతారు అందరూ. కాని అందంగా లేని దాన్ని గురించి కూడ అందంగా చెపుతాడు కవి; ఆ అందంగా చెప్పబడింది కవిత.

అందంగా లేని దాన్ని గురించి అందంగా చెప్పటమే కాదు, అందంగా ఉన్నదాన్ని గురించి అందంలేకుండా కూడ చెపుతాడు కవి. ఆ అందం లేకుండా చెప్పబడింది కూడ కవితే. అది గద్యం అయినా సరే పద్యం అయినా సరే.

అయితే, కవిత అనేది కొంత అవాస్తవికమా ?

అవును, అంటే చెప్పేతీరు కొంత అవాస్తవికంగా ఉంటుంది కాని అసలు విషయం వాస్తవంగానే ఉంటుంది.

ఇటువంటి అవాస్తవాలను మనం ఉదయసంధ్యలోను, సాయంసంధ్యలోను నిత్యం వాడుతుంటాం.

ఉదయం నిద్రలేవగానే అంటాం, సూర్యుడు ఉదయిస్తున్నాడని, తిరిగి సాయంత్రం అంటాం సూర్యుడు అస్తమిస్తున్నాడని.

మనకు తెలుసు సూర్యుడు ఉదయించడనీ, అస్తమించడనీ.

అంటే, మనం ఉభయ సంధ్యల్లోనూ పలికేది కవితనే?

గొప్ప వైజ్ఞానికులు కూడ నిత్యం ఈ మిధ్యా వాక్యాలనే పలుకుతుంటారు.

ఉండేది వేరు, చెప్పేది వేరు.

ఈ విధమైన అవాస్తవ అభివ్యక్తి మాత్రమే కవిత కాదు కాని కవితలో ఇటువంటివి కూడ ఉంటూంటాయి.

నేటి జీవితంలో కవితకూ అకవితకూ మధ్య ఉన్న రేఖ స్థూల రేఖగా కాక సూక్ష్మ రేఖగా క్రమేణ రూపాంతరం చెందుతూంది.

అంటే వాస్తవ జగత్తే కవితా జగత్తుగా పరివర్తిస్తూంది. వ్యావహారిక జీవితమే రసజీవితంగా మారవచ్చు.

వాస్తవ జగత్తు కవితా జగత్తుగా మారితే ప్రమాదం లేదుకాని కవితా జగత్తు వాస్తవ జగత్తుగా మారితే కొంత ప్రమాదకరమే.

వ్యావహారిక జగత్తులో రసం లభిస్తుంటే పరవాలేదు కాని రసజగత్తు వ్యావహారికమైతే చిక్కు.

విఖ్యాత నాట్యశాస్త్రకారుడు భరతుడు పదిహేడు వందల సంవత్సరాల నాడు రెండు పదాలు ప్రయోగించాడు. "లోకధర్మి", "నాట్యధర్మి" అని.

లోకధర్మి అంటే వ్యావహారిక జగత్తుకు చెందినవాడు; నాట్యధర్మి అంటే కళాజగత్తుకుచెందినవాడు. ఒకటి లౌకిక జగత్తు, రెండవది రసజగత్తు. ఈ రెండూ విభిన్నమైనవి అని.

వీటనే వాస్తవ జగత్తు అనీ కవితాజగత్తు, లేక కావ్య జగత్తు అనీ అనవచ్చు.

రసాత్మకమైన వాక్యం మాత్రమే కావ్యంకాదు, ఆలోచనాత్మకమైన వాక్యం కూడ కావ్యమే అని.

అంటే కవితారచనలో అనుభూతికి మాత్రమే రూపం ఇవ్వటం కాదు, ఆలోచనకు కూడ రూపం ఇవ్వటం అని.

అనుభూతీ ఆలోచనా కూడ మానవుని మానసప్రసూనాలు. రెండూ రెండు విధాల చిత్తవృత్తులను సృష్టిస్తాయి. ఒకటి సంవేదనామూలకం, రెండవది తర్కమూలకం.

ఈ రెండూ కూడ కవితకు సమానార్హాలే అని ఒక వాదం. ఆలోచనకు దోహదం ఇస్తాయి తర్కం, తత్వం మొదలైన శాస్త్రాలు. అనుభూతినివ్వజాలవు.

అనుభూతి లేకుండా ఆలోచనతో మాత్రమే మనిషి సుఖంగా జీవించలేడు. అనుభూతిని అందించేది శాస్త్రజ్ఞానం కాదు, కళలు మాత్రమే, కనుక కవితద్వారా అందాలసింది అనుభూతియే కాని ఆలోచన కాదని మరోవాదం.

శాస్త్రరచనలు కూడ పూర్వం పద్యాల్లో చేయబడినాయి కారణం, గద్యం కంటే పద్యం సులభం, కంఠస్థం చేయటానికి.

అటువంటి శాస్త్రరచనల పద్యాలు కవితలు కాజాలవు, పద్యరచనలు మాత్రమే అవుతాయి. కాని హృదయాన్ని కదిలించజాలవు.

కవితా లక్షణం భోగట్టాను అందించటం కాక హృదయాన్ని కదిలించే రసానుభూతిని ప్రసాదించటమే అని.

ఈ దృక్పథం ప్రకారమైతే "వాక్యం రసాత్మకం కావ్యం" అనేది మాత్రమే అసలైన కవితా లక్షణం అవుతుంది.

శాస్త్రం జ్ఞానాన్నిస్తే కళ ఇస్తుంది ఆనందాన్ని అనే సూత్రాన్ని అంగీకరిస్తే కవితా లక్షణం అనుభూతి నివ్వటమే అని తేలుతుంది.

జ్ఞానాన్ని అందించటం కవితా లక్షణం అయితే ఇంకా ఇతర శాస్త్రాల అవస్యకత ఏముంటుంది ?

ఆధునిక జీవితంలో రసజగత్తు సన్నబడి వ్యావహారిక జగత్తు పరిపుష్టం అవుతున్నందు వల్ల కవితా రచన కూడ ఈ సత్యాన్నే ప్రతిబింబిస్తూంది.

కవితా సృష్టి స్వచ్ఛందమైంది. అది ఏమి నెరవేర్చటానికైనా అర్హత కలిగి ఉన్నది.

అది అనుభూతి నివ్వవచ్చు, ఆలోచన నివ్వవచ్చు. కాని దేన్నిచ్చినా, అది సుందరంగా ఇవ్వాలి, ఒక ప్రత్యేకరీతిలో ఇవ్వాలి. ఆ విధంగా కానపుడు ఇంకా కవిత ఎందుకు ? కవిత కాని సాహిత్యమే సరిపోతుందిగా!

కవిత కాని సాహిత్యం పాఠకునికి ఏమైనా ఇస్తుంది కాని కవిత ఇవ్వకలిగిన దాన్నివ్వలేదు.

అందుకే కవిత.



# నవ్వుల సభలో రాలిన ముత్యాలు

హైదరాబాద్‌లో గతనెలలో "జిందాదిలన్‌ఏ" అనే హాస్యరచయితల సంఘంవారు ప్రపంచ హాస్యమహాసభలు నిర్వహించారు. ఈ ఐదురోజుల హాస్య సమ్మేళనంలో దేశ విదేశాల నుంచి 160 మంది ప్రతినిధులు హాజరయ్యారు. వివిధ భాషల్లో వివిధ ప్రతినిధుల ప్రసంగాల్లో హాస్యరసం తెప్పలుగా పారి శ్రోతల్ని ఆనందపరవశుల్ని చేసింది. వాటిలో కొన్నిటిని దండగుచ్చి పాఠకుల మెళ్ళో వెయ్యడమే ప్రస్తుత లక్ష్యం.




## జాకర్ చెప్పిన జోకులు

ఓసారి ఓ జంతుప్రదర్శనశాలకి కొంతమంది పర్యాటకులు వెళ్ళారట. అక్కడ ఉన్నట్టుండి ఓ గాడిద నవ్వడం మొదలెట్టిందట. సందర్శకులకు ఆశ్చర్యం కలిగి అక్కడవున్న కాపలా మనిషిని గాడిద నవ్వుకు కారణం అడిగారట. "అయ్యా నిన్న మీలాగే కొందరు వచ్చి కొన్ని జోకులు పేల్చివెళ్ళారు ఈ గాడిదకి అవి ఇప్పుడర్థమైనట్టున్నాయ్! అందుకే నవ్వుతోంద"ని సమాధానం చెప్పాడు. అయితే ఈ జోకు లోక్‌సభ స్పీకర్ శ్రీ బలరామ్ జాకర్ ఊరికే చెప్పలేదు. లోక్‌సభలో వేడివేడి చర్చలు జరుగుతుంటే ఉద్రిక్తతలను హాస్యం ద్వారా ఉపశమింపజేయవచ్చని జాకర్ అన్నట్లు పత్రికల్లో చదివి హాస్య సమ్మేళనం ప్రారంభోత్సవానికి జాకర్ తగినవారని గ్రహించామని సభలో నిర్వాహక అధ్యక్షుడు శ్రీ నరేంద్రలూథర్ చెప్పగా "నేనా విషయం ఐదేళ్ళ నాడే చెప్పాను మీరిప్పుడు అంటే ఐదేళ్ళ తరువాత గ్రహించినట్టున్నారు" అని చెబుతూ పైకథ చెప్పి సభలో అందరూ ఘొల్లున నవ్వేలా చేశారు.

ఆ రోజుల్లో సర్దార్ హుకుంసింగ్ లోక్‌సభ స్పీకరు. ఓరోజున రాష్ట్రపతి భవన్‌లో ఓ పార్టీ జరుగుతోంది. ఆ రోజుల్లో శ్రీ మణిరామ్ బాగ్రి ఎప్పుడూ ఆవేశంతో ప్రసంగిస్తూ సభలో ఉద్రిక్తత కలిగిస్తూండేవాడు. ఆయన కూడా ఆ విందుకు సతీసమేతంగా హాజరయ్యాడు. స్పీకర్‌గారికి శ్రీ బాగ్రి తన భార్యను మామూలుగా పరిచయం చేశాడు. శ్రీ హుకుంసింగ్ వెనువెంటనే ఆయన భార్యకు వంగి నమస్కారం చేశాడు. పాపం! ఆ ఇల్లాలు ఆశ్చర్యపోయి "సర్దార్‌జీ! మీరు నాకంటే పెద్దవారుగదా! నాకీవిధంగా నమస్కరిస్తున్నారేమిటి?" అని ప్రశ్నించింది.

హుకుంసింగ్ శ్రీ బాగ్రీవైపు చూస్తూ "ప్రతిరోజు మా హౌస్‌లో (పార్లమెంటులో) మీవారిని రెండుగంటల పాటు భరించలేకపోతున్నాను. మరి మీ యింట్లో మీవారితో ఇరవైనాలుగ్గంటలూ ఎలా నెగ్గుకొస్తున్నారో! మీ సహనానికి నా వందనాలు" అన్నారు.

## గాడ్గిల్ చెప్పిన హాస్యగాథలు

కేంద్రమంత్రి శ్రీ వి. యన్. గాడ్గిల్ హాస్య చలనచిత్రాల ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేస్తూ కొన్ని హాస్యకథలు వినిపించారు.

బొంబాయినుంచి పూనా నగరానికి ఓసారి ఓ ప్రొఫెసర్‌గారు ప్రయాణమై వస్తుంటే దారిలో కారు చెడిందట. సరే! దారిన పోయే ఒంటెద్దు బండిని పిలిచి దానిలో ఎక్కి మళ్ళీ ప్రయాణం మొదలెట్టారట ప్రొఫెసర్‌గారు. ఉబుసుపోక కాలక్షేపం కబుర్లు మొదలెట్టారు. పూనా

చేరాలంటే ఎంత టైము పడుతుందని ప్రొఫెసర్‌గారు బండివాడ్ని ప్రశ్నించారు. గంట పడుతుందని సమాధానం వచ్చింది. ప్రొఫెసర్ బండివాడ్ని ఉద్దేశించి "నీలాంటి మేధావికి గంట కాలం చాలా విలువైంది. అందువల్ల వృథాకాలయాపన లేకుండా మెదడుకు మేత పెట్టడానికి ఒకళ్ళనొకళ్ళు ప్రశ్నలు వేసుకొందాం! ఇందులో నువ్వు గెలిస్తే పది రూపాయలు నేనిస్తాను. నేను గెలిస్తే నీనుంచి ఒకరూపాయి మాత్రమే తీసుకొంటాను" అని చెప్పి "నువ్వు సామాన్యుడివి కాబట్టి ముందు అడిగే అవకాశం నీకే వదిలేస్తున్నాను అడుగు" అన్నారు.

బండి బాబు వెంటనే అందుకొని "నీళ్ళల్లో ఈదేది, గాలిలో ఎగిరేది, భూమిపై నడిచేది, చెట్లపై ఎక్కేది ఆ జంతువేది?" అని ఓ ప్రశ్నగురిపెట్టాడు. ప్రొఫెసర్ బుర్ర గోక్కొని పప్పులుడకలేదని చెప్పి పదిరూపాయలు సమర్పించుకొన్నారు. అయితే "నేనుకూడా అదే ప్రశ్న నిన్ను వేస్తున్నాను. సమాధానం చెప్పు"మన్నారు. "సమాధానం నాకూ తెలీదు" అని అమాయకంగా అంటూనే ఓ రూపాయి ప్రొఫెసర్‌గారి చేతిలోపెట్టాడు. ఆ రకంగా బండివాడు తొమ్మిది రూపాయలు లాభం కొట్టేశాడు. మనం ఇస్త్రీచొక్కా వేసుకొన్నాం తెలివైనవాళ్ళం అనుకొంటే ఇస్త్రీచొక్కా వేసుకోనివాళ్ళు మనచేత పప్పులో కాలు వేయించేస్తారు.

## దేవులపల్లి నవ్వింపులు

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు తెలుగు హాస్య రచయితల గోష్ఠిలో కొన్ని చలోక్తులు వినిపించారు.

ఒకాయన సభలూ, సమావేశాలూ నిర్వహించడంలో బహు సమర్థుడుగా పేరుపొంది మంచి "నిర్వాహకుడు" అని పేరు బడసాడు. చివరికి ఓరోజున ఆయన హఠాత్తుగా కన్నుమూశాడు. ఆయన శవాన్ని సాగనంపడానికి వాహకులు ఎవరూ ముందుకు రాలేదు. "ఇప్పుడు




కూడా ఆయన నిర్వాహకుడుగా ప్రసిద్ధిచెంది నిర్‌వాహకుడుగానే కీర్తిశేషుడయ్యాడు" అన్నారు.

## ఇతర ప్రతినిధులు చెప్పినవి

శ్రీ పి. కె. దొరైస్వామిగారు ఓ సభలో మాట్లాడుతున్నారు. ఇంతలో మైకు చెడింది. ఎలక్ట్రిషియన్‌ని పిలిపించి బాగుచెయ్యమన్నారు అతగాడు అటూఇటూ సర్ది "స్పీకర్‌కి స్క్రూ లూజు" అని అన్నాడు. మైకు బాగయిందేమో అది అందరికీ వినబడి అనుకోకుండా అందర్నీ నవ్వించింది.

ఓ గవర్నమెంటు గుమాస్తాగారికి ఓసారి సెలవు కావాల్సొచ్చింది. సరే కారణం వివరిస్తూ సెలవు చీటీ ఇచ్చాడు—"మా ఆవిడ గర్భవతి కాబోతోంది కాబట్టి.... (about to become pregnant)" అని రాశాడు. ఆఫీసరుగారు అది చూచి నిట్టూర్చి బహుశః ఏదో తప్పు రాసుంటాడని తలచి "గర్భందాల్చాకనే (Leave) లీవను కొంటాను" అన్నాడు. "ఎప్పుడయినా నేనక్కడ ఉండాల్సిందే! (What ever in either case my presence is required)" అని పూర్తిచేశాడు ఆ ఉద్యోగి.



# గుర్తింపు కావాలి!

## మల్లెపందిరి

డా॥ పో. సత్యసుందరం

మనిషికొక పిచ్చి లక్షణం ఉంది. ప్రతివాడు తనను గుర్తించాలని. ప్రతివాడికి తనకి వర్త్ ఉన్నట్లు ఆ వర్త్ పెరుగుతున్నట్లు కలలొస్తాయి. ఈ వర్త్ గుర్తించకపోతే ఏడుపొస్తది. ఎవరితోను చెప్పుకోలేడు. ప్రక్కవాడి వర్త్ గుర్తించబడితే చూస్తూ ఊరుకోలేడు. ఇంటిలో తలుపు వేసుకొనైనా ఏడ్వాలనిపిస్తుంది.

ఉద్యోగంలో ప్రమోషన్ రావచ్చు, జీతం పెరగొచ్చు, పెరగక పోవచ్చు. అదికాదు పాయింటు. మన ప్రమోషన్‌ను ఆఫీసులో నలుగురు గుర్తిస్తున్నారా లేదా అన్నది బాధ. గుర్తించకపోతే ఏడుపొస్తది. జీవితం మీద విరక్తి వస్తది. కాస్త ఎక్కువ గౌరవం ఇస్తారేమోనని అడెంటర్లకు ప్రమోషన్ వచ్చినట్లు చెప్పుకొంటాం. ఇన్ని చేసినా గుర్తింపు లభిస్తదన్న గ్యారంటీ లేదు.

లెక్చరర్ అంటే పూర్వం ఎంతో గౌరవం ఉండేది. ఇపుడు లెక్చరర్ అంటే ప్యూన్ కూడా కేర్ చేయడంలేదు. లెక్చరర్ ఎదురొచ్చినా సైకిల్ దిగడంలేదు. పైగా సిగరెట్ కాలుసుకొంటూ పోతున్నాడు. ఇది గుర్తించే లెక్చరర్లు సూట్లు వేసుకోవడం మానేశారు. విద్యార్థిలాగానే ప్యాంటులు షర్టులు వేసుకొస్తున్నారు. ఈపరిస్థితులలో ప్రతి లెక్చరర్ ఈ జన్మలో ఒక సంవత్సరమైనా ప్రిన్సిపల్‌గా ఉండాలని కోరుకొంటున్నాడు, నలుగురి కాళ్ళు పట్టుకొని ప్రిన్సిపల్ అవ్వాలని ప్రయత్నం. ప్రిన్సిపల్ అయితే కనీసం ప్యూన్ అయినా గౌరవిస్తాడని ఆశ.

మనం మంచి హోదాలో ఉండవచ్చు. అయితే, మనం బస్సుగాని, రైలుగాని ఎక్కితే సీట్లు ఖాళీగా ఉండక పోవచ్చు. మన హోదా గుర్తించి ఎవడైనా సీటు ఖాళీ చేసి (తిట్టుకొంటూనైనా) ఇస్తాడేమోనని అటు ఇటూ చూస్తాం. నాలాంటి లెక్చరర్ అయితే కనీసం పూర్వ విద్యార్థి ఎవడైనా ఉన్నాడేమోనని, వెతుకుతాడు. ఎవడన్నా విద్యార్థిలాగే కనబడితే నాలుగు మాటలు చెప్తాడు. తాను లెక్చరర్ అని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో గుర్తు చేస్తుంటాడు. ఇన్ని చేసినా నిలబడటం తప్పని సరి అవ్వచ్చు. కాలేజీలోనే గుర్తింపు లేనప్పుడు బస్సులోనో, రైలులోనో తనను గౌరవించేవాడుండడని అయ్యగారు ఆలస్యంగా గ్రహిస్తారు.

చీరకొత్తదవచ్చు, ఖరీదుగల్లదే అవ్వచ్చు. ఇల్లాలుకి వాటి వలన తృప్తిరాదు. కాస్త బయట తిరిగి వస్తే నలుగురు చూస్తే తృప్తి వస్తది. అంతేగాని తన పక్క ఇంటావిడే చీర రంగు నీరసంగా ఉందంటే, తనకి నీరసం వస్తది. మనసు గిలగిలలాడుతుంది. టీ ఇచ్చి మంచి మాటలు చెప్పి చీర అంటగట్టిన కొట్టు వాడిని శపించాలనిపిస్తది. రాత్రి నిద్రుండదు. చీరకు గుర్తింపు పోయినట్టు ఆ ఇల్లాలు బాధపడిపోతది. కొట్టు వాడి మీద కోపం భర్త మీద చూపించినా చూపించవచ్చు.

సినిమా పోషరుపైన హీరో హీరోయిన్ ఫొటోలు పెద్దవిగా ఉండాలి. లేకపోతే అభిమాన సంఘాలు ఊరుకోవు. అయితే ఈ రూలు పాత సినిమా పోస్టర్లకు వర్తించక పోవచ్చు. పాత సినిమాలో హీరోయిన్ ఇపుడు బ్రతికుండకపోవచ్చు బ్రతికున్నా అమ్మ లేక అమ్మమ్మ పాత్ర వేస్తుండవచ్చు. ఏదో చిన్న పాత్ర వేసినావిడ ప్రస్తుతం ప్రముఖ హీరోయిన్ అయివుండవచ్చు. అందు వలన అసలు హీరోయిన్ ఫొటో చిన్నది, ఈవిడగారి

ఫొటో పెదదిగా వాల్‌పోస్టరుపై చూస్తాం. అయ్యో నా గతి ఇలా అయిపోయిందా అని అలనాటి హీరోయిన్ బాధ పడవచ్చు. తప్పదు తల్లీ అని మనం ఓదార్చాలి. చేసేది ఏమీలేదు. పోస్టర్‌కే గుర్తింపు లేకపోతే సినిమాకు ఏమి గుర్తింపు ఉంటది. అందుకే ఇన్ని బాధలు. సినిమా పేరు 'ఏడంతస్థుల మేడ' అవ్వవచ్చు. అలా అని పోస్టర్ మీద ఏడంతస్థుల మేడ కలర్ ఫొటో వేస్తే చూసే వాడుండడు. పూరి గుడిసె ఫొటో వేస్తే నలుగురినీ ఆకర్షిస్తుంది. కొన్ని సినిమా పోస్టర్లపై, ప్రకటనలలో నటీనటుల పేర్లుండవు. హీరో హీరోయిన్ పేర్లుండవు. దర్శకుడు, సంగీత దర్శకుడు పేర్లుంటాయి. గుర్తింపు కొరకు పడే బాధలు ఎన్నో.

రచయిత్రికి కాస్త పేరురాగానే నవలలు ఎలా వ్రాసినా అమ్ముడుపోతాయి. అందువల్ల నవల టైటిల్ చిన్న అక్షరాలతో, రచయిత్రి పేరు పెద్ద అక్షరాలతో ప్రింట్ చేయడం జరుగుతుంది. లేకపోతే నవలకు గుర్తింపు లేదు. పూర్వం రచయిత ఫొటో అట్టచివర పేజీలో ఉండేది. ఆయన సాధించిన, సాధించబోయే విజయాలు ఆ ఫొటో క్రింద ఉండేవి. ప్రస్తుతం కొంతమంది రచయిత్రుల ఫొటోలు ఫ్రంట్ కవరు పేజిమీదే ఉంటున్నాయి. పుస్తకాలు కొన్నా కొనక పోయినా, చదివినా చదవకపోయినా కనీసం ఫొటోలన్నా చూస్తారు.

సామాన్యంగా ఇంటి ముందు నేమ్ బోర్డులో మన పేరు, హోదా ఉంటాయి. ఈ మధ్య ఒక ఇంటి ముందు నేమ్ బోర్డు నాకు విడ్డూరంగా కన్పించింది. ఆయన తన పేరు, హోదాతో పాటు తాను పలానా ప్రముఖ పత్రికా వ్యవస్థాపకుడు సంపాదకుని కుమారుడనని వ్రాయించుకున్నాడు. చెక్క బోర్డయితే ఎవరన్నా ఎత్తుకు పోతారేమోనని, రాతి ఫలకంపై చెక్కించి గోడలో అమర్చాడు. వారికీ, కీర్తిశేషులైన వారి తండ్రికీ వందనాలు.

గుర్తింపు రావాలనుకొనే వాళ్ళు ప్రత్యేక ప్రయత్నాలు చేయాలని నా మనవి. నేను ఇంగ్లీషులో పుస్తకాలు వ్రాసినా, కొన్ని వందల వ్యాసాలు వ్రాసినా మా వూళ్ళో




గుర్తింపు రావాలను కోవడం పొరపాటు. పనిచేసే కాలేజి లోనే గుర్తింపుండక పోవచ్చు. కాలేజిలోను, ఇంటిలోకూడా గుర్తింపు రావాలంటే, కనీసం ఒక తెలుగు సినిమాకైనా కథ, మాటలు, రెండు (బూతు) పాటలు వ్రాయాలి. ఆ పని ఎప్పుడు చేస్తానో నాకే తెలియదు. అప్పటి వరకు మీటింగులలో వెనక సీటులో కూర్చోవలసిందే.

గుర్తింపు కొరకు చేసే ప్రయత్నాలలో కొన్ని చిక్కులు లేకపోలేదు. నాకు డాక్టరేటు నేమ్ వచ్చి మూడు సంవత్సరాలైనా, ఇంటి ముందు నేమ్ బోర్డు లేదు. బందరు లాంటి పురాతన పట్టణంలో డాక్టర్ అంటే వైద్యం చేసేవాడని నా గట్టి నమ్మకం. నేను డాక్టరునని నేమ్ బోర్డు పెడితే, నా ఇంటి ముందు పేషెంట్లు లేకపోతే – నన్ను పశువుల డాక్టర్ అనుకోవచ్చు. నాకంత క్రెడిటా !

విశ్వ విద్యాలయాలలో లెక్చరర్‌పైన రీడరు, రీడరుపైన ప్రొఫెసర్ (ఆచార్య) హోదాలుంటాయి. రీడరైనా బందరులో రీడరని చెప్పుకోకూడదు. రీడర్ అంటే ప్రెస్‌లో ప్రూఫ్ రీడర్ అనుకోవచ్చు ప్రజలు. లెక్చరర్ అని చెప్పుకోవడమే మర్యాదగా ఉంటుంది. ప్రొఫెసర్ అయ్యాక, ఎవరైనా ఆచార్యుడనని చెప్పుకొంటే ప్రజలు ఈయన ఏ మఠం నుండో వచ్చారని అనుకోవచ్చు. ఇంటిలో 'ఈ రోజునుండి నేను ఆచార్యుడను' అని చెపితే భార్యా, పిల్లలు, ఏ మఠంలోనో చేరుతున్నానని కంటనీరు పెట్టుకొనవచ్చు !

# ఇంద్రగంటివారి 'కీర్తితోరణ' కావ్యవైశిష్ట్యం

హనుమచ్ఛాస్త్రి కవి
సిసలైన కవి" అంటే చాలు—

మహాకవి, కవిశేఖర, కవిభూషణ లాంటివి ఏవో తగిలించ నక్కరలేదు. కవి అంటేనే గొప్ప బిరుదు—"

ఈ మాటలు పలికినది ఎవరో కాదు ఆధునికాంధ్ర కవితా నిష్ణాత శ్రీ కృష్ణశాస్త్రిగారు.

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు అభ్యుదయ కవులు; సంప్రదాయ కవులు. ఇంకా చెప్పాలంటే కృష్ణశాస్త్రి గారన్నట్టు "అసలు సిసలైన కవి : తెలుగు కవి"

## ధూర్జటి వేంకట బాలాజి

"ఏ గాలి తాకుననే మూర్ఛనలుపోయే వరూధినీ విపంచికా తంత్రుల మేళవింపు లాంటి రసోద్వేగం ఒకటీ—

ఉభయ భాషా వ్యుత్పన్నతచేత సుపరిష్కృతం గావింపబడిన శబ్ద శక్తి రెండు—"

ఒక భావుకుని మాటల్లో చెప్పాలంటే ఇది హనుమచ్ఛాస్త్రిగారి కవిత్వానికి జీవ ధర్మాలు.

తెలుగు సామాజిక జీవనము—నిండుగా ప్రవహించే తెలుగుదనము వారి కవిత్వానికి నేస్తాలు—

సంప్రదాయ బంధురమైన వాక్కును అనుభూతితో మేళవించి తమ కవితా వాణిని వినిపిస్తారు. అందులకు నిదర్శనం—నేటి మన కీర్తితోరణ కావ్యం.

కీర్తితోరణ కావ్యం ప్రధానంగా చరిత్రకు సంబంధించింది. తెలుగు సాహిత్యంలో వచ్చిన చారిత్రక కావ్యాలకన్నా ఇది భిన్నమైనది. ఏలన—గతించిన వైభవాన్ని అంతకుమందలి కవులు ప్రశంసిస్తే, ప్రస్తుత కావ్య కర్త ఆ వైభవానికి రూపకల్పన చేసి, జాతి నుద్దీపింపజేసే కావ్యాలుగా తీర్చిదిద్ది మన కళ్ళెదుట పెట్టడం ఒక విశేషం—

కీర్తితోరణ కావ్యంలో కాకతీయ సంస్కృతిని తైల వర్ణ చిత్రాలుగా మలచి **close up** లో కవిత్వం, నాట్యం, శిల్పం—ఈ మూడింటిని విశిష్టంగా చూపడం జరిగింది.

అక్కన బయ్యనలచే ఓడింపబడిన మనుమసిద్ధి పదవీచ్యుతుడై సింహపురి రాజ్యాన్ని కోల్పోతాడు. ఆ సందర్భాన మనుమసిద్ధి ప్రధానమంత్రియైన తిక్కన మహాకవి, రాజ్యభ్రష్టుడైన తన రాజుకు తిరిగి రాజ్యం ప్రసాదింపవలెనసే కోరికతో కాకతీయ రాజ్యాధినేతయైన గణపతిదేవుని ఆశ్రయించడానికి, ఓరుగల్లుకు ప్రయాణమై వెళ్తాడు. గణపతిదేవుడుససైన్యంగా నెల్లూరి సీమకు తరలి, సింహపురి రాజ్యంమీద దురాక్రమణ చేసిన అక్కన బయ్యనలను ఓడించి, ఆ రాజ్యాన్ని తిరిగి మనుమసిద్ధికి అందజేస్తాడు. తిక్కనగారు ఓరుగల్లునకు వెళ్ళినపుడు, తిక్కనగారి ఆగమన వృత్తాంతాన్ని విన్న గణపతిదేవుడు దర్శించిన తిక్కనార్యుని రూపం ఇది—

"నిత్య పినాకినీ నియమాభిషేక ని
ర్మల దేహయష్టి రంజిలెడువాడు

మహిత సింహపురీ రాజ మనుమసిద్ధి
యాప్తకవి మంత్రివరుడు ప్రత్యక్షమయ్యె"

తిక్కనగారి అద్వైతత్త్వానికి, అద్వైతతత్త్వ కాంతిని కవితీకరించిన నేర్పు ఇందులో చూడదగ్గది. భావంతో పాటు బలమైన భాష ఉన్నప్పుడే కవిత్వానికి దీప్తి కలుగుతుంది.

కావ్యంలో రెండవ అంశం నాట్యం. గణపతిదేవుని సేనాని 'జాయప్ప' గొప్ప నాట్య కళాకోవిదుడు. అతని శిష్యురాలు మధుమావతి. జాయప్ప తన ఆచార్యకంలో అద్భుతమైన నర్తకీ మణులను తీర్చిదిద్దాడు. అట్టి వారికి మధుమావతి ఆదర్శప్రాయురాలు. గణపతిదేవుని విజయోత్సవ సూచకంగా మధుమావతిగావించిన నాట్యం అపూర్వమైంది. ఆ దృశ్యాన్ని కవిశ్రీ ఇంద్రగంటి వారు ఈ విధంగా కవిత్వీకరిస్తారు.

"పొల పొలపారిజాతము పూవులు రాలినయట్లు, కప్రపుం బలుకులతావి, చెల్వలను పైకొనినట్టులు వెన్నెలల్ సుధల్, వెలచినయట్లు, వార్షికపు వేళ మయూర సర్వ బర్హమున్ జలజల విప్పి యాడినట్లు చాన యొసంగెను నాట్య మాధురిన్"

పారిజాతపు పువ్వులు రాలినయట్లు, వెన్నెల అమృతం కురిసినట్లు, వార్షికపు వేళలో మయూరం పురివిప్పారినట్లు మధుమావతి నాట్యం ఒప్పినది.

కవిత్వం నాట్యాల తరువాత పేర్కొన దగినది శిల్పం. కాకతీయులు అన్ని కళలను పోషించినట్లే శిల్పకళను కూడా పోషించారు. కాకతి రుద్రదేవుని ఆస్థానకవి యచితేంద్రునివరంగా కవి పలికినపలుకులు శిల్పకళౌన్నత్యాన్ని తెలుపుతాయి.

"ఏమి స్తంభము లేమి పద్మములు ! ఏమేమీ శిలాకల్పనా సామీచీన్య వితాన శిల్పము ! గవాక్ష ప్రస్ఫురద్రూప శోభామాధుర్యము ! నృత్య భంగిమ సద్భామాభి రామ ప్రకర్షాముగ్ధత్వము ! ఏమిలోకము సుదీర్ఘ స్వప్న కైలాసమో!"

—నిజానికి ఇవి యచితేంద్రుని పలుకులుగావు. శాస్త్రి గారి కవిత్వపు తళుకులు. ఈ విధంగా కవిత్వం, నాట్యం, శిల్పం ప్రధానమైన అంశాలుగా కావ్యనిర్మాణం గావించిన ఇంద్రగంటివారు, కావ్యంలోని శీర్షికలను సైతం శిల్ప మహితం గావించారు. తెలుగు జాతిని, తెలుగు తనాన్ని గురించి ప్రస్తుతిస్తూ, ఇంతకు ముందు ఎంతోమంది కవులు ఎన్నో రకాలైన కావ్యాలు రచించారు. కానీ 'కీర్తితోరణం' తన విలక్షణతను తాను నిలుపుకొంది. తెలుగుజాతి మీద, తెలుగుతనం మీద మమకారంతో కథాసంవిధానంలో, శిల్పంలో, రచనలో, పాత్రలను రూపకల్పన చేయడంలో, పాత్రలను రంగంమీదకు తీసుకొని రావడంలో, కావ్యంలోని ఖండికలకు క్రొత్తపేర్లను నిర్ణయించడంలో కవి అణువణువున తన ప్రతిభను వ్యక్తం చేశారు. హనుమచ్ఛాస్త్రి గారి గ్రంథ సంపుటిలో, దక్షారామం, కీర్తి తోరణం—అనే కావ్యాలు, సారమతి నన్నయ్య, కాళిదాస కళా మందిరం అనే విమర్శనాత్మక గ్రంథాలు—హనుమచ్ఛాస్త్రి కథలు, విజయదశమి అనే కథల సంపుటులు, పాటల మంజరి వంటి గేయ సంపుటి వంటివి పేర్కొన దగినవి. వీనిలో కాళిదాస కళామందిరం—కీర్తి తోరణా లకు రాష్ట్ర అకాడమీ బహుమతులు రావడం విశేషం—

ఆధునిక తెలుగు సాహిత్యంలో దుర్భాకవారి 'రాణా ప్రతాప సింహ చరిత్ర' గడియారం వారి 'శివభారతం'— మధునాపంతుల వారి 'ఆంధ్ర పురాణం' వంటి ఉత్తమ కావ్య శ్రేణికి చెందుతుంది, ఇంద్రగంటి వారి 'కీర్తితోరణ' కావ్యం కూడా.

★ ★ ★

## 'కడలి గుండెకు' కు కృష్ణశాస్త్రి వార్డు

1984 సంవత్సరానికి దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక సాహిత్య బహుమతిని 'కడలిగుండె' (వచన కవితా సంపుటి) గెలుచుకుంది. రచయిత శ్రీ వై. రామకృష్ణారావు, హైదరాబాదులోని చైతన్య కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పనిచేస్తున్నారు.

# ఇంద్రగంటివారి 'కీర్తితోరణ' కావ్యవైశిష్ట్యం

" హనుమచ్ఛాస్త్రి కవి
సిసలైన కవి " అంటే చాలు—

మహాకవి, కవిశేఖర, కవిభూషణ లాంటివి ఏవో తగిలించ నక్కరలేదు. కవి అంటేనే గొప్ప బిరుదు—"

ఈ మాటలు పలికినది ఎవరో కాదు ఆధునికాంధ్ర కవితా నిష్ణాత శ్రీ కృష్ణశాస్త్రిగారు.

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు అభ్యుదయ కవులు ; సంప్రదాయ కవులు. ఇంకా చెప్పాలంటే కృష్ణశాస్త్రి గారన్నట్టు " అసలు సిసలైన కవి : తెలుగు కవి "

ధూర్జటి వేంకట బాలాజి

" ఏ గాలి రాకుననే మూర్ఛనలుపోయే వరూధినీ విపంచికా తంత్రుల మేళవింపు లాంటి రసోద్వేగం ఒకటీ—

ఉభయ భాషా వ్యుత్పన్నతచేత సుపరిష్కృతం చేయింపబడిన శబ్ద శక్తి రెండు—"

ఒక భావుకుని మాటల్లో చెప్పాలంటే ఇవి హనుమచ్ఛాస్త్రిగారి కవిత్వానికి జీవ ధర్మాలు.

తెలుగు సామాజిక జీవనపు—నిండుగా ప్రవహించే తెలుగుదనపు వారి కవిత్వానికి నేస్తాలు—

సంప్రదాయ బంధురమైన వాక్కును అనుభూతితో రంగరించి తమ కవితా వాణిని వినిపిస్తారు. అందులకు నిదర్శనం—నేటి మన కీర్తితోరణ కావ్యం.

కీర్తితోరణ కావ్యం ప్రధానంగా చరిత్రకు సంబంధించింది. తెలుగు సాహిత్యంలో వచ్చిన చారిత్రక కావ్యాలకన్నా ఇది భిన్నమైనది. ఏలన—గతించిన వైభవాన్ని అంతకుముందలి కవులు ప్రశంసిస్తే, ప్రస్తుత కావ్య కర్త ఆ వైభవానికి రూపకల్పన చేసి, జాతి నుద్దీపింపజేసే కావ్యాలుగా తీర్చిదిద్ది మన కళ్ళెదుట పెట్టడం ఒక విశేషం—

కీర్తితోరణ కావ్యంలో కాకతీయ సంస్కృతిని తైల వర్ణ చిత్రాలుగా మలచి close up లో కవిత్వం, నాట్యం, శిల్పం—ఈ మూడింటిని విశిష్టంగా చూపడం జరిగింది.

అక్కన బయ్యనలచే ఓడింపబడిన మనుమసిద్ధి పదవీచ్యుతుడై సింహపురి రాజ్యాన్ని కోల్పోతాడు. ఆ సందర్భాన మనుమసిద్ధి ప్రధానమంత్రియైన తిక్కన మహాకవి, రాజ్యభ్రష్టుడైన తన రాజుకు తిరిగి రాజ్యం ప్రసాదింపవలెననే కోరికతో కాకతీయ రాజ్యాధినేతయైన గణపతిదేవుని ఆశ్రయించడానికి, ఓరుగల్లుకు ప్రయాణమై వెళ్తాడు. గణపతిదేవుడు ససైన్యంగా నెల్లూరి సీమకు తరలి, సింహపురి రాజ్యంమీద దురాక్రమణ చేసిన అక్కన బయ్యనలను ఓడించి, ఆ రాజ్యాన్ని తిరిగి మనుమసిద్ధికి అందజేస్తాడు. తిక్కనగారు ఓరుగల్లునకు వెళ్ళినపుడు, తిక్కనగారి ఆగమన వృత్తాంతాన్ని విన్న గణపతిదేవుడు దర్శించిన తిక్కనార్యుని రూపం ఇది—

" నిత్య పినాకినీ నియమాభిషేక ని
ర్మల దేహయష్టి రంజిలెడువాడు
.................................
మహిత సింహపురీ రాజ మన్మసిద్ధి
యాప్తకవి మంత్రివరుడు ప్రత్యక్షమయ్యె "

తిక్కనగారి అద్వైతత్వానికి, అద్వైతతత్త్వ కాంతిని కవితీకరించిన నేర్పు ఇందులో చూడదగ్గది. భావంతో పాటు బలమైన భాష ఉన్నప్పుడే కవిత్వానికి దీప్తి కలుగుతుంది.

కావ్యంలో రెండవ అంశం నాట్యం. గణపతిదేవుని సేనాని ' జాయప్ప ' గొప్ప నాట్య కళాకోవిదుడు. అతని శిష్యురాలు మధుమావతి. జాయప్ప తన ఆచార్యకంలో అద్భుతమైన నర్తకీ మణులను తీర్చిదిద్దాడు. అట్టి వారికి మధుమావతి ఆదర్శప్రాయురాలు. గణపతిదేవుని విజయోత్సవ సూచకంగా మధుమావతిగావించిన నాట్యం అపూర్వమైంది. ఆ దృశ్యాన్ని కవిశ్రీ ఇంద్రగంటి వారు ఈ విధంగా కవిత్వీకరిస్తారు.

"పొలపొలపారిజాతము పూవులు రాలినయట్లు, క్రవపుం బలుకులతావి, చెల్వలను పైకొనినట్టులు వెన్నెలల్ సుధల్, వెలచినయట్లు, వార్షికపు వేళ మయూర సర్వ బర్హమున్ జలజల విప్పి యాడినట్లు చాన యొసంగెను నాట్య మాధురిన్ "

పారిజాతపు పువ్వులు రాలినయట్లు, వెన్నెల అమృతం కురిసినట్లు, వార్షికపు వేళలో మయూరం పురివిప్పారినట్లు మధుమావతి నాట్యం ఒప్పినది.

కవిత్వం నాట్యాల తరువాత పేర్కొనదగినది శిల్పం. కాకతీయులు అన్ని కళలను పోషించినట్లే శిల్పకళను కూడా పోషించారు. కాకతి రుద్రదేవుని ఆస్థానకవి యచితేంద్రునిపరంగా కవి పలికినపలుకులు శిల్పకళౌన్నత్యాన్ని తెలుపుతాయి.

"ఏమి స్తంభము లేమి పద్మములు ! ఏమేమీ శిలాకల్పనా సామీచీన్య వితాన శిల్పము ! గవాక్ష ప్రస్ఫురద్రూప శోభామాధుర్యము ! నృత్య భంగిమ సద్భామాభి రామ ప్రకర్షాముగ్ధత్వము ! ఏమిలోకము సుదీర్ఘ స్వప్న కైలాసమో!"

—నిజానికి ఇవి యచితేంద్రుని పలుకులుగావు. శాస్త్రి గారి కవిత్వపు తళుకులు. ఈ విధంగా కవిత్వం, నాట్యం, శిల్పం ప్రధానమైన అంశాలుగా కావ్యనిర్మాణం గావించిన ఇంద్రగంటివారు, కావ్యంలోని శీర్షికలను సైతం శిల్ప మహితం గావించారు. తెలుగు జాతిని, తెలుగు తనాన్ని గురించి ప్రస్తుతిస్తూ, ఇంతకు ముందు ఎంతోమంది కవులు ఎన్నో రకాలైన కావ్యాలు రచించారు. కానీ 'కీర్తితోరణం'

## 'కదలి గుండెకు' కు కృష్ణశాస్త్రి అవార్డు

1984 సంవత్సరానికి దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక సాహిత్య బహుమతిని 'కదలిగుండె' (వచన కవితా సంపుటి) గెలుచుకుంది. రచయిత శ్రీ పై. రామకృష్ణారావు, హైదరాబాదులోని చైతన్య కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పనిచేస్తున్నారు.

తన విలక్షణతను తాను నిలుపుకొంది. తెలుగుజాతి మీద, తెలుగుతనం మీద మమకారంతో కథాసంవిధానంలో, శిల్పంలో, రచనలో, పాత్రలను రూపకల్పన చేయడంలో, పాత్రలను రంగంమీదకు తీసుకొని రావడంలో, కావ్యంలోని ఖండికలకు క్రొత్తపేర్లను నిర్ణయించడంలో కవి అణువణువున తన ప్రతిభను వ్యక్తం చేశారు. హనుమచ్ఛాస్త్రి గారి గ్రంథ సంపుటిలో, దక్షారామం, కీర్తి తోరణం-అనే కావ్యాలు, సారమతి నన్నయ్య, కాళిదాస కళా మందిరం అనే విమర్శనాత్మక గ్రంథాలు-హనుమచ్ఛాస్త్రి కథలు, విజయదశమి అనే కథల సంపుటులు, పాటల మంజరి వంటి గేయ సంపుటి వంటివి పేర్కొనదగినవి. వీనిలో కాళిదాస కళామందిరం-కీర్తి తోరణా లకు రాష్ట్రీ అకాడమీ బహుమతులు రావడం విశేషం—

ఆధునిక తెలుగు సాహిత్యంలో దుర్భాకవారి 'రాణా ప్రతాప సింహ చరిత్ర' గడియారం వారి 'శివభారతం'- మధునాపంతుల వారి 'ఆంధ్ర పురాణం' వంటి ఉత్తమ కావ్య శ్రేణికి చెందుతుంది, ఇంద్రగంటి వారి 'కీర్తితోరణ' కావ్యం కూడా.

★ ★ ★

సాయంత్రం ఆరు గంటలయింది. కారులోంచి దిగి, మా యింటి లోపలికి నడిచాను.

హాల్‌లో సోఫాలో కూర్చుని, నా బ్రీఫ్‌కేస్‌ని బల్లమీద పెట్టి షూస్ విప్పుతున్నాను. లోపల్నుంచి నా భార్య లలిత కాఫీ తీసుకొచ్చింది.

"మీ ఊరి నుంచి ఏదో ఉత్తరం వచ్చింది" అంది. ఆ 'ఏదో ఉత్తరం' అనడంలో ఎంత ఎగతాళి !




"ఎవరు వ్రాసారు ?"

"అ(! నేను చూడలేదు. ఆ చెత్తంతా ఎవరు చూస్తారు" అంది వెటకారంగా నవ్వుతూ.

లలితకు పల్లెటూరి వాళ్ళంటే కంపరం. ఆమె సిటీలో పుట్టి, సిటీలో పెరిగింది. శ్రీమంతుల బిడ్డ. కొన్ని విలువలు ఆమెకు తెలియవు. ఆస్తులున్నా పల్లెటూరి వాళ్ళు మడ్డిగా వుంటారని మా మామగారివైపు వాళ్ళందరికీ అసహ్యం చిరాకు.

నేను పుట్టినది పల్లెటూరే అని నా భార్యకు వేళాకోళం. నా పొరపాటు కొంతవుంది. బుద్ధి తక్కువై ఒకసారి నాకు పల్లెటూరి వాళ్ళలో వుండే బద్ధకం, అశుభ్రత ఎంత గిట్టదో తెలియబరిచాను. అది అప్పుడప్పుడు నామీద జోక్స్ వేయడానికి ఆమెకు చాలా ఉపయోగపడుతోంది. ఇప్పుడెవరో పల్లెటూరి రైతు నాకు ఉత్తరం వ్రాశాడని, నా కిటువంటి వాళ్ళు పరిచయమా ! అని ఆమెకు వేళాకోళం. ఆమె మాటలకు సమాధానం చెప్పకుండా నేను కాఫీ త్రాగి, గదిలోకి వెళ్ళి ఉత్తరం చూశాను. రంగారావ్ వ్రాశాడు. ఇప్పుడంతగా పొలం పనులు లేవనీ, మద్రాస్ చూడడానికి వస్తున్నాడనీ, నాతో సరదాగా గడపొచ్చు కొన్ని రోజులనుకున్నాడనీ, స్టేషన్‌కి రమ్మని వ్రాశాడు. ఇరవైన వస్తున్నాడు.

నా గుండె దడ దడా కొట్టుకుంది. ఎలాగ ? ఇప్పుడేం చెయ్యడం ? కుర్చీలో కూర్చుని ఆలోచనల్లో పడ్డాను. మనస్సు గతంలోకి పరుగెత్తింది.

* * * * *

నేను పుట్టింది పల్లెటూరిలో. నాకు సిటీ లంటే చాలా ఇష్టం. నాకు శుభ్రత ఎక్కువ. చదువుకోడం అంటే చాలా ఇష్టం. మేము పేదవాళ్ళ మయినా మా నాన్నగారు ఒక్కడే కొడుకని హైస్కూల్ దాకా చదివించారు. చిన్నతనం నుంచీ బంధువులలోనూ, స్నేహితులలోనూ, చదువుల్లో చాలా చురుకైన వాడినని నేను పేరున్న వాడిని. నేను

హైస్కూల్‌కి రోజూ మావూరి నుంచి ప్రక్కనే వున్న టౌన్‌కి, మునసబుగారి అబ్బాయి రంగారావ్‌తో, కలిసి వెళ్ళేవాడిని. రంగారావ్ చాలా మంచివాడు. కానీ బద్ధకం, మడ్డితనం ఎక్కువ. అతనికి చదువంత బాగా రాలేదు. మునసబుగారి పలుకుబడితో హైస్కూల్‌దాకా వచ్చాడు. మా ఇద్దరిదీ గట్టి స్నేహం.

హైస్కూల్‌లో నేను చివరి సంవత్సరంలో వుండగా, మా నాన్నగారికి పక్షవాతం వచ్చి కాళ్ళుపడిపోయాయి, ఆయన చేస్తున్న గుమాస్తా ఉద్యోగం పోయింది. ఇంక నా చదువయిపోయినట్టే, ఉద్యోగం చేయాలి అని నేనూ నాన్నగారూ కూడా దిగులు పడ్డాం కానీ నాకు అదృష్టం కలిసొచ్చింది.

మా దూరపు బంధు వొకాయన అమెరికా నుంచి తన వ్యాపారం పనిమీద మన దేశం వచ్చి ఎలాగా వచ్చాను గనక బంధువు లందరినీ చూద్దామనుకొని, మా నాన్నని కూడా చూడడానికి పనిగట్టుకుని వచ్చాడు. ఆయన వరసకు పెదనాన్న అవుతాడు. బాగా ఆస్తిపరుడు.

మా నాన్న పరిస్థితి చూసి ఆయన, "నేను సహాయం చేస్తానుగా! బాగా చదివే కుర్రాడిని ఉద్యోగంలో పెట్ట కండి. పై చదువులు చదివించండి. డబ్బెంత కావల్సినా మా కంపెనీ హైదరాబాద్ బ్రాంచ్ నుండి తీసుకోండి" అన్నాడు.

"తిరిగి అబ్బాయి సంపాదించగానే డబ్బిచ్చేస్తా. అలా ఒప్పుకుంటేనే మరి!" అన్నారు నాన్న. ఆయనకి అభిమానం ఎక్కువ.

"అలాగే! అలాగే?" అన్నారు పెదనాన్నగారు.

ఆ విధంగా నా చదువాగిపోకుండా సమయానికి ఆయన ఆదుకున్నాడు.

రంగారావే నేనింక స్కూల్‌కి రానేమోనని దిగులు పడ్డాడు. తన తండ్రితో చెప్పి ధనసహాయం చేయిస్తానని కూడా అన్నాడు. నేను వద్దని పెదనాన్నగారి సహాయం సంగతి చెప్పాను.




రోజూ ఇద్దరం కలిసి స్కూల్‌కి వెళ్ళే వాళ్ళం. చెప్పొద్దూ, రంగారావే అంత మంచివాడూ, సున్ని మనస్తత్వం కలవాడూ కాకపోతే, అతని మడ్డి ఎంతో దూరంగా వుండేవాడిని. చెబితే కష్టపడ ఏమనే వాడిని కాదు. నేనంటే వెర్రి అభిమానం శుభ్రత కొంచం కూడా లేదతనికి. కానీ స్నేహ ఎంత గొప్పవాడు!

వానొస్తే తన బండిలో ఇంటి నుండి తీసుకెళ్ళే తిరిగి దింపేవాడు. ఇలాంటి సహాయాలు రకరకాలు చే కానీ అతనిని ఒక్కసారి లెక్క చేయకపోయినా, చేసినా చాలా బాధ పడేవాడు. అందుకని అన్నీ శ చాలా జాగ్రత్తగా వ్యవహరించే వాడిని.

స్కూల్‌ఫైనల్ నేనుపాసయ్యాను. రంగారావ్ ఫె అంతటితో చదువాపి అతను వ్యవసాయంలో దిగ నేను పై చదువులకి మద్రాస్ వచ్చాను. ఇద్దరం తర ఉత్తరాలు వ్రాసుకొనే వాళ్ళం.

కొన్నేళ్ళలో నా చదువులు పూర్తయ్యాయి. ఒక కంపెనీలో జాబ్ వచ్చింది. వీటితో బాటూ సిటీ అలవాటయింది.

ఆ పల్లెటూరూ, ఆ మనుషుల బద్ధకం, అబ్బబ్బ! గార్బేజ్ గాళ్ళు! అని కంపరంతో మా అ నాన్నలని కూడా మద్రాస్ తీసుకొచ్చేశాను. కొన్నేళ మా పెదనాన్నగారి డబ్బు కూడా తిరిగి యిచ్చేశాను. ప్రమోషన్స్ వచ్చాయి.

రంగారావ్‌తో ఉత్తరాలు సాగుతూనే వున్నాయి. అ మా ఊర్లోనే పెళ్ళి అయ్యింది. నేను తప్పకుండా రావాలి– అని మరీ మరీ పిలుస్తూ ఉత్తరం వ్రాశాడు. కానీ ఆ గార్బేజ్ లోకి ఎవరెళ్తారని నేను వెళ్ళలే. జ్వరం వచ్చిందని వ్రాశాను. నేను రానందుకు బాధ పడుతూ పెద్ద ఉత్తరం వ్రాశాడు.

మూడేళ్ళయ్యింది. నా ఉద్యోగం మారి పెద్ద ఉద్యోగం లోకి వెళ్ళాను. బాగా సంపాదించాను. స్టేటస్ మారింది. నా లైఫ్ స్టయిల్ మారిపోయింది. పెళ్ళి కూడా చేసేసుకున్నాను. రంగారావ్‌ని పెళ్ళికి పిలవలేదు. నా మామగారు చాలా ధనవంతులు.

పెద్దింటి వాళ్ళకు యీ మడ్డి మనిషిని నా స్నేహితుడని పరిచయం చేస్తే యిద్దరికీ అవమానం జరుగుతుందని నాకు తెలుసు. రంగారావ్ సహించ లేడు. బాధ పడ్తాడు. నేను చాలా జాగ్రత్త పడుతూ మాస్నేహం నిలుపు కుంటున్నాను.

* * ○ * *

ఇప్పుడు హఠాత్తుగా రంగారావ్ వస్తాననగానే నాకు గాభరాగా ఉంది.

రంగారావ్‌ని చూడగానే నాభార్య అసహ్యించుకుంటుంది. సందేహంలేదు. నా మామగారూ వాళ్ళూ నవ్వుతారు. ఇలాంటి గార్బేజ్‌నీ, మట్టినీ స్టేషన్‌కెళ్ళి యింటికి తీసుకు రావడమేమిటనీ, మర్యాదలేమిటనీ జోక్ చేసుకుంటారు. ఇలాంటి వాళ్ళను వదుల్చుకోవాలి అని సలహా యిస్తారు.

అంతేకాక నాకు తెలీకుండా అటువంటి ప్రయత్నాలు చెయ్యవచ్చు. అది రంగారావ్‌కి ఘోరమైన అవమానం. ఎలాగైనా అతనిని రాకుండా ఆపాలి ! మా స్నేహం కుసంస్కారం వలన చెడిపోకూడదు !

నేను బాగా ఆలోచించి, నా దగ్గర డబ్బు లేదని రాస్తే రాడనుకుని, సందేహించకుండా వెంటనే వ్రాశాను. ఇప్పుడు రావద్దు. నేను డబ్బుకి కొంచం కష్ట పడుతున్నాను. ఆరు నెలలయ్యాక రా ! పరిస్థితులు మెరుగు పడతాయి. ఇద్దరం సరదాగా గడపొచ్చు అని వ్రాశాను.

ఆ రోజు నుంచీ ప్రతిరోజూ అవస్థే. ఇరవైన వస్తాడా! నిద్ర పట్టటం లేదు ప్రతిరాత్రీ. మంచి వాడని స్నేహం నిలుపు కున్నాను. యీ రోజు కొందరు వెటకారం చేస్తారని యిలా వ్రాశాను. ఏమనుకున్నాడో ? ఒక వేళ వస్తే వీళ్ళు అవమాన పరిస్తే ఎంత కష్ట పడతాడో ? అసలే అతను సెన్సిటివ్ ! స్నేహం చెడిపోక తప్పదా ! భగవాన్ !

పదహారో తేదీన రంగారావ్ దగ్గర నుండి ఇంకో ఉత్తరం వచ్చింది.

" రఘూ !

నేను మద్రాస్ చూడకపోయినా, సిటీల గురించి విన్నాను, ఖరీదు లెక్కువనీ; డబ్బు విపరీతంగా ఖర్చవుతుందనీ. నీ దగ్గర డబ్బు చాలటం లేదన్నావు. ఇలాంటప్పుడు నేను వచ్చి నీ పరిస్థితులు చూడడం మానసికంగా నిన్ను చిత్రహింస పెట్టడమవుతుంది. అందుకే ఇప్పుడు రావటంలేదు. నీ కుపయోగపడుతుందని ఐదువేల రూపాయలకి డ్రాఫ్ట్ పంపిస్తున్నాను. ఈ మధ్య మన ఊళ్ళో బేంక్ ఒకటి తెరిచారు. మేనేజర్ డ్రాఫ్ట్ నువ్వు మద్రాసులో మార్చుకోగలవని చెప్పారు. కాబట్టి యీ చిన్న మొత్తం వాడుకో, ఇంకా కావలిస్తే సందేహించకుండా అడుగు.

ఇంతే సంగతులు

ఇట్లు

నీ ప్రాణమిత్రుడు

రంగారావ్."

చెంప దెబ్బ కొట్టినట్లయ్యింది.

దిమ్మెరపోయాను. కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. "రంగా ! నువ్వు గార్బేజ్ కాదు ! మట్టివి కాదు! మట్టిలో మాణిక్యానివి ? మేమే, లోపల మురికి పట్టి పైకి మాత్రం మెరుస్తున్న బంగారంలోని గాజు పెంకులం ! ఇటువంటి పరిస్థితి సంస్కారమున్న ఏ మనిషికీ రానియ్యకు భగవంతుడా !" అనుకున్నా. అంతకన్నా ఏం చెయ్యగలను ?

చెడ్డ మనుషులను దూరంగా వుంచాలిగానీ, స్వంతంగా విలువలు నిర్ణయించుకొని మంచి మనుషులనూ దూరంగానే వుంచే నా బోటి వాళ్ళు స్వయంగా చేసుకున్న పంజరంలో యిరుక్కుని అప్పుడప్పుడు మనోవేదన అనుభవించాల్సిందే !



# ఈ దేశం నాది

ని సంవత్సరాలకు పూర్వం జరిగిన సంఘటన. విదేశీ ప్రముఖులొకరు మన దేశం దర్శించ వచ్చారు. తిరిగి వెళ్తూ విమానాశ్రయంలో విలేఖరులకు విలువైన రహస్యం వెల్లడించారు. ఇండియా దటీజ్ భారత్‌లో కొనడానికి మనుషులు దొరుకుతారని, ఈ దేశంలో ప్రతి మనిషికీ ఒక ' రేటు ' ఉంటుందని వారు ప్రకటించారు. నవభారత నిర్మాత నెహ్రూ పాలిస్తున్న కాలమది. పండితుల వారితో పాటు, పామరజనులు కూడ ఆ విదేశీ ప్రముఖులు వెల్లడించిన రహస్యానికి ఆయనపై విరుచుకు పడ్డారు. పాతికేండ్ల క్రిందటి సంగతి యిది.

పాతిక సంవత్సరాల తర్వాత ........ పండిత నెహ్రూ మనుమల వారి హయాంలో.... ఈ మనుషులు, వాళ్ళ రేటుకి సంబంధించిన వివరాలు మరికొన్ని వెలుగులోకి వచ్చినై. గూ ఢ చా రి కుంభకోణంగా మనపత్రికల వారు ముద్దు పేరుతో ప్రకటిస్తున్న వార్తలను చూస్తుంటే, ఈ దేశంలో ప్రతి మనిషికీ ఒక రేటు ఉంటుందని మాత్రమే కాక, ఆ రేటు మరీ అగ్గువని ( ' అగ్గువ ' అంటే రాయలసీమ ప్రాంతంలో చౌక అని అర్థం ) కూడమనకు తెలిసివస్తున్నది. ఒక్క పెగ్గు విదేశీ విస్కీకి ప్రధాన మంత్రి కార్యాలయం నుంచి రహస్యపత్రాలు అంద జేసి, అమ్ముడుపోయిన మనుషుల వివరాలు నేడు మన కళ్ళ ముందున్నాయి. వంద, రెండు వందల రూపాయలకు మిలటరీ రహస్యాలు కూడ తాను కొన్నానని శ్రీ కూమర్ నారాయణ్ ఒప్పుకుంటున్నారు. పాతిక సంవత్సరాలుగా లానీ దేశద్రోహపు వ్యాపారమే చేస్తూ, తన యజమాను లకు కోట్లు, తన స్వంతానికి మిలియన్లు సంపాదించానని కూడ శ్రీవారు సెలవిచ్చారు.

పాతిక సంవత్సరాలకు పూర్వమంటే .... 1960 ప్రాంతమన్న మాట. అప్పట్లో పండిత నెహ్రూ నాయ కత్వంలో .... సోషలిస్టు పద్ధతి సమాజం క ( Socialistic Pattern of Society ) దేశం ( స్తున్న రోజులన్న మాట. ఆ రోజుల్లో.... ఆ ప్ర నెహ్రూ కార్యాలయంలోనే పుట్టి, దిన దిన ప్రవర్ధమాన పెరిగిన వ్యాపారం - " దేశపు రహస్య పత్రాల అ కాల వ్యాపారం " వ్యాపారపు అవసరాలకు రహ పత్రాలను కొనటం ఆరంభించిన ప్రముఖులు క్రమక్ర గా మిలటరీ రహస్యాలతో సహా అన్ని పత్రాలను కొన అమ్మటం కొనసాగించారు. మిత్రదేశం రష స్నేహదేశం ఫ్రాన్సు, ఆదుకునే దేశం అమెరి

**యువతావాణి**

ఆర్. యస్. కే. మూర్తి

వగైరాలన్నీ ఈ రహస్య పత్రాలకై ఎగబడి, వాటి ఎగరేసుకుపోయారు. చండ ప్రచండులురాలుగా ప్రచార చేయించుకొన్న శ్రీమతి గాంధి స్వంత ఆఫీసులో ఈ వ్యాపారం మరీ జోరుగా జరిగిపోయింది. ఆమెగా కాబినెటు నిర్ణయాలు కారప్పూస పొట్లాల కాగితాలుగా కాల్ గరల్సు అభినందనలతో, కె. జి. బి, సి. ఐ. ఏ కార్యాలయాలకు చేరుకున్నాయి. ( ట )

ఇదంతా చెప్పటం ఇందిరా మాతనో, రాజీవ్ రాకుమా రునో నిరసించటానికి కాదు. వారు కూడ రేటున్న మనుష లేనని సూచించటానికి కాదు. వారెవరో, ఏమిటో చరిత్ర రేపు నిష్పక్ష పాతంగానే తీర్పు చెప్తుంది. వారి పరిపాలనా కాలపు సామాన్యుల జీవిత చరిత్రలు సాక్ష్యాలుగా సర్వు లకూ కనిపిసూనే ఉంటె.




చెప్పవచ్చిన విషయమేమిటంటే............

పది పెగ్గుల విదేశీ విస్కీకి, పది పచ్చనోట్లకీ, కాదంటే వచ్చి శృంగారాల అనుభవాలకీ ... దేశపు రహస్యాలను పరాయివాళ్ళకు అందించిన అధికారులు; ఉద్యోగుల మాటేమిటి ?

అధికారులలో ఐ. ఎ. ఎస్‌లు, ఐ. పి. యస్‌లు స్థాయైన వాళ్ళున్నారు. "ఫొటోకాపీ" అలెగ్జాండరుగా నేడు పిలవబడుతున్న "పి. సి." అలెగ్జాండరు ప్రచండమైన తెలివితేటలు కలవారుగా నిన్న మొన్నటి దాకా ప్రచారం బ్రహ్మాండంగా సాగి పోయింది. ఉద్యోగులలో పెద్ద చిన్నలు అందరూ ఉన్నారు. సిద్ధాంతాలు వల్లించే వారు, ప్రబోధాలు గావించే వారు కూడా వీరిలో తక్కువేమీ ఉండరు.

అయినా వీరందరూ అణాకీ; అర్ధణాకీ (పాతకరెన్సీలో) అమ్ముడు పోయారు. ఇలా ఎందుకు జరిగింది ?

నేటి యువత వేసుకోవలసిన ప్రశ్న యిది.

మన రహస్యాలను కొన్నవారు కమ్యూనిస్టులా ? కాపిటలిస్టులా ? అన్నది మన యువతకు ప్రశ్నార్థకం కానక్కరలేదు.

అమ్మిన మనవారి కథా కమామీషు ఏమిటన్నదే వారు వితర్కించుకో దగిన విశేషం.

మనిషికి స్వార్థం సహజ బలహీనత. కాదంటే సహజ లక్షణం. ప్రతివారి గుండెని నిండి ఉండేది-స్వార్థం. స్వార్థం- అన్నది మనిషి చైతన్యానికి అవసరమైన లక్షణమేమో కూడ. అయితే, ఈ స్వార్థం పరార్థానికి విఘాతం కలిగించేదిగా రూపొంద కూడదు. పరహితార్థం కొరకు ప్రాణాలైనా అర్పించ గలగటం-మహాత్ములకు మాత్రమే సాధ్యమయ్యే పని కావచ్చు. మన స్వార్థం కోసం పరహితార్థాన్ని మంటకలవటం మాత్రం మానవత్వ మనిపించుకోదు.

ఒక్క మాటలో చెప్పాలంటే, పదుగురి హితాన్ని చెడగొట్టకుండా, ఎవరి హితాన్ని వారు చూచుకొనడం- సామాన్యమైన ధర్మసూత్రం.

అయితే పదుగురి హితానికి, తన స్వార్థానికి సంఘర్షణ వచ్చినప్పుడు ?

అప్పుడే మనిషి పరీక్షకు గురి అవుతాడు. ఆ పరీక్షలో నెగ్గేటట్లుగా మనుషులు రూపొందించ బడాలి. మనిషి నిర్మాణం జరగాలి.

1947 ఆగష్టు 15 అర్ధరాత్రి మనకు వచ్చిన స్వాతంత్ర్యం మనుషుల సంగతి మరిచి పోయింది. వ్యవస్థలూ, అవస్థలూ అంటూ ఇడుముల పాలవు తున్నది.

తమ బిడ్డల కోసం తల్లి దండ్రులు....

తమ తల్లి తండ్రుల కోసం బిడ్డలు....

ఆత్మీయుల కోసం అందరూ....

స్వార్థాన్ని నిర్దేశించుకొంటారు. వారి హితానికి ఎక్కువ విలువనిస్తారు.

అంటే, మనిషి హృదయంలో ఉండే స్వార్థాన్ని, అప్యాయత అనురాగం అణచివేసి ఉంచగలవన్న మాట.

ఈ దేశంమీద, ఈ సమాజంమీద, ఈ దేశపు సంస్కృతి సంపదల మీద అప్యాయత, అనురాగం మనుషుల హృదయాలను నింపితే....అవి వారిలోని స్వార్థాన్ని వెడల నడపగలవు.

'దేశం నాది' అనుకొనే వ్యక్తి దేశపు రహస్యాలను పెగ్గు విస్కీకి అమ్మలేడు కదా !

ఇట్టి అప్యాయత, అనురాగాలు వెల్లివిరిసే మంచిరోజు కోసం కృషి చేయాలని యువతావాణి పిలుపునిస్తున్నది.



# ముక్కలైన న్యాయం కలిసున్న అన్యాయం

" నా దేశంలో
గూండాయిజానికి తప్ప
మంచివాళ్ళకు చోటేది?
రాళ్ళను
కొలవడానికి
పువ్వుల
గొంతులు కోసే జాతి నాది "

అంటూ రాజకీయాలను నిరసిస్తూ ఓ కవి ఆక్రోశించాడు. కనీసం నాలుగైదైనా హత్యలు చేసుండాలి. త్రాగుబోతు అయివుండాలి. తరచుగా ఆడవాళ్ళను మానభంగం చేస్తుండాలి. అధికారంలో ఉన్నవాళ్ళకు అలా పనులు చేసి పెడుతుండాలి. ఈ లక్షణాలుంటే చాలు ఎవరైనా తొందరగానే రాజకీయ నాయకుడిగా చెలామణీ అయిపోగలడని నా చిన్నప్పుడు అనుకొనేవాణ్ణి.

కాని రోజులు మారాయి. ఇపుడు హత్యలు చేయకూడదు, రహస్యంగా ఇతరులచేత చేయించగలగాలి. నాటుసారా త్రాగకూడదు. విలువైన 'బార్'లలో ఫారిన్ మద్యం సేవించాలి. ఆడవాళ్ళతో ఎలాంటి నీచసంబంధం పెట్టుకుంటున్నా సభల్లో తన సోదరిగా చెప్పుకోవాలి. ఒకవేళ ఎక్కడైనా బలవంతంగా మానభంగం చేయాల్సి వస్తే డబ్బుతోనో, అధికారంతోనో నోరు మూసెయ్యగలగాలి. లేదా 'యాక్సిడెంటు'లో పోయినట్లు చూపించగలగాలి. అలాగే అధికారంలో వున్నవాళ్ళను భయపెట్టేటంత బలం సంపాదించుకోవాలి. అంత బలం లేకపోతే అధికారంలో వున్న వర్గాన్ని ఏ మాయ ప్రయోగాలు చేసైనాసరే అనేక వర్గాలుగా విడగొట్టాలి. అందులో ఎక్కువ వర్గాలు తనమాటను వేదంగా భావించేలా లౌక్యం ప్రదర్శించాలి. బీదవాళ్ళకు సేవ చేస్తున్నామనే వంకతో దీనజన సంస్థలు నెలకొల్పాలి. డబ్బు పోగేసి ఎక్కువ మొత్తం రహస్యంగా తన ఖాతాలో జమ చేసుకుంటుండాలి. ఇలాంటి లక్షణాలుంటే దేశానికే అధినేత కాగలడు ఎవడైనా.

" జంతువును పట్టుకొని
నోటితో చీల్చి
రక్తాన్ని పీల్చి
పచ్చిగా నమిలేస్తుంటే
రాక్షసుడు;
గొర్రెను కొని, పెంచి
ఇతరులతో
చంపించి
వండించి
పెట్టించుకొని తింటే
నాగరికుడు "

## కలియుగ రాజకీయాలు
### రావి రంగారావు

గొప్ప రాజకీయ నాయకుడై పోవాలనుకున్నవాడు రాక్షసుడిలా కనిపించకూడదు! తోలు చర్మం, ఎముకల దండలకు బదులుగా ఖద్దరు చొక్కాలు, పూలమాలలు ధరిస్తుండాలి. ఎవరి అంతు చూడదలచినా వాళ్ళతో బాగా సన్నిహితం కావాలి. ఆ తర్వాత అనుకొన్నపని సాధించాలి. అమాయకులైన ప్రజలు తన కార్యక్రమాలన్నిటినీ నమ్మి జై కొట్టుతూ నాయకుణ్ణి ఆకాశానికెత్తుతుంటారు.

# ధర్మరాజ్యం

"ధర్మరాజ్య మంటే మతరాజ్యం (Theocratic State) కాదు. ధర్మము వేరు, మతం వేరు. ధర్మరాజ్యమును ఆంగ్లములో 'Rule of law' అని చెప్పవచ్చు. ధర్మరాజ్యమంటే మత విహీన రాజ్యం కాదు. ఏ ఒక్క ప్రత్యేక మతమునకు చెందని రాజ్యం. సర్వమతములను సమానంగా ఆదరించుట ధర్మరాజ్య ప్రత్యేక లక్షణం. ధర్మరాజ్యము నందు వ్యక్తి యొక్క సర్వతో ముఖమైన వికాసము, సమాజ శ్రేయస్సు– ఈ రెండూ ఒకదానికోసం, మరొక దానిని బలిచేయ కుండా సాధించబడతాయి. భారతీయ సంస్కృతి వ్యక్తి, సమాజము–ఈ రెంటి శ్రేయస్సునూ సమానంగా పరిగణిస్తుంది. సమగ్రాభివృద్ధిని కాంక్షిస్తుంది. సమన్వయాన్ని సాధిస్తుంది. ఇక పోతే పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యక్తికి మాత్రమే అత్యున్నతమైన ప్రాధాన్యత యివ్వ బడుతుంది. సోషలిస్టు వ్యవస్థలో వ్యక్తిని పూర్తిగా నిర్లక్ష్యంచేసి, సమిష్టికే (సమాజానికే) ఎక్కువ ప్రాధాన్యత నిస్తారు. పెట్టుబడిదారీ వ్యవస్థ, సామ్యవాద వ్యవస్థ–ఈ రెండూ అసంపూర్ణాలే."

– పండిట్ దీనదయాళ్ ఉపాధ్యాయ

"ఎక్కడ అధికారం వెలుగుతున్నా
ఏదో ఆశతో
గుమిగూడుతారు జనం
పురుగుల్లాగా;
అపుడే మొదలవుతుంది
బలుల రాజకీయం వేట
మెల్లగా నిశ్శబ్దంగా కదులుతూ
గుటుక్కున మింగేసే ఆట"

అందమైన వలల్లో చిక్కుకునే పక్షుల్లాగా నాశనమైపోతుంటారు జనం. అందుకే ఎన్నిసార్లు ఎన్నికలు వచ్చినా ప్రజలు బుద్ధి లేకుండా ఓట్లేస్తూనే వున్నారు, నాయకుల్ని గెలిపిస్తూనే వున్నారు, తాము మాత్రం ఓడిపోతూనే వున్నారు.

"భక్తులు
రాక్షసులకు
విష్ణువు భక్తులు
దేవతలకు
బద్ధవైరముంటుంటే
పై వాళ్ళకు మాత్రం
పరమ బంధుత్వం"

ఎన్నికల్లో పనిచేసిన రకరకాల పార్టీల కార్యకర్తల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటూనే వుంటుంది శాశ్వతంగా. కాని ఎన్నికల తర్వాత రకరకాల పార్టీల నాయకులు సందర్భానుసారంగా చేతులు కలుపుకుంటూనే వుంటారు, చేతులు తడుపుకొంటూనే వుంటారు.

ఇన్నిరకాలుగా దుర్మార్గం బలిసిపోటానికి ప్రధాన కారణం ఒకటే. సన్మార్గులంతా ఎవరికివారు చేతులు ముడుచుకొని ఎవరింట్లో వారు కూర్చొని ఒకరి సంగతి ఒకరు పట్టించుకోకుండా విడిపోయి వుండటమే. అందుకే కవి ఇలా అంటున్నాడు.

"ఈ చీకటికి
ఇంత బలమెక్కడిది ?
సూర్య బింబం
చుక్కలుగా విడిపోయింది."

# కౌటిల్యుని అర్థశాస్త్రములో గూఢచారి వ్యవస్థ

క్రీస్తు పూర్వం 4వ శతాబ్ది ప్రాంతములలో ꠶ సామాన్యముగా అనుసరించబడుతున్న సాంఘిక విషయాలకు దర్పణము వంటిది కౌటిల్యుని అర్థశాస్త్రము.

అర్థ శాస్త్రమనగానే నేటి ఆంగ్లేయార్థ శాస్త్రము కాదు, (ఎకనామిక్స్). ఆనాటి రాజుల విధులు, ప్రజలకు వారు చేయవలసిన సదుపాయములు స్పష్టీకరించబడినవి. అవి సూత్రముల ప్రకారము రాజోద్యోగులు నిర్బంధముగా అనుసరించుచుండిరో లేదో తెలిసికొనుటకు విపులమైన ఏర్పాట్లు చేయబడివి.

పరిపాలనా విధానము వేరు వేరు శాఖలుగా విభజింప బడినది.

ఆనాటి కౌటిల్యుని కాలమున గల గూఢచారి వ్యవస్థ ప్రస్తుతాంశం.

మంత్రులను యెన్నుకొనుటలో వారిని సామ దాన భేదోపాయములనుపయోగించి పరీక్షించాలి. వారు ఉపథా శుద్ధులు.

ఆ పరీక్షలలో నెగ్గిన మంత్రులతో సమాలోచన చేసి గూఢచారులను నియమించాలి ఆ గూఢచారులలో 9 రకముల వారి నెన్నుకోవాలి.

కాపటికుడు; ఉదాస్థితుడు; గృహపతితుడు; వైదేహికుడు; తాపసవ్యంజనుడు; సత్త్రి: తీక్ష్ణులు; రసదులు; భిక్షుకి అను పేరులుగల తొమ్మిది రకముల గూఢచారి శాఖలు.

కాపటికుడు : ఎదటి వారి రహస్యములను తెలుసుకొన గలవాడు, గొప్పలు చెప్పేటటువంటి శిష్యుడు.

ఉదాస్థితుడు : పరివ్రాజిక వృత్తి వదలినవాడు, ప్రజ్ఞావంతుడు, శౌచవంతుడు.

గృహపతితుడు : వ్యవసాయం చేసి నష్టపడ్డవాడు, ప్రజ్ఞాశౌచములు గలవాడు అగు కర్షకుడు. ( కపట ) వ్యవసాయదారుని వలె నుండి, గూఢచారి చర్య జరిపేవాడు. అంటేఅటువంటి వాడే గూఢచారిత్వం నెరపాలి.

వైదేహికుడు :వ్యాపారములో దెబ్బతిన్నవాడు. ప్రజ్ఞా శౌచములు గలవాడు. (కపట) వ్యాపారిగా వుంటూ వారు కార్యములను చూడాలి.

తాపసవ్యంజనుడు : గుండు చేయించుకున్నవాడు గాని, జటాధారిగాని మళ్ళీ యేదో వృత్తి అవలంబించ గోరిన వాడు. తనవంటి తాపస వేషములో వున్న శిష్యుల మధ్య తిరుగుతూ, బహిరంగంగా నెలకో, రెండు నెలలకో శాకములు గాని, యవలను గాని భుజిస్తూ, రహస్యంగా నిత్యం భోజనం చేస్తూ గూఢచారిగా తన పనులను చూచుకునే వాడు.

సత్త్రి : ఏ బంధువులు లేనివారు. విధిగా ప్రభుత్వంవల్ల పోషింప బడవలసినవారు.

వీరిలో అంగవిద్య అనగా స్పర్శ మాత్రం చేత అదృష్టం చెప్పగలవారు.

లక్షణ విద్య అనగా పుట్టుమచ్చల లక్షణాలవల్ల కలిగే అదృష్టాన్ని తెలుపగలవారు.

జృంభకవిద్య అంటే మంత్ర ప్రయోగంతో యెదటి వారిని వశపరచుకొనుట, అదృశ్యమగుట మొదలైన శక్తులు గలవారు.

తీక్ష్ణులు : జనపదములందు శూరులై ప్రాణాలకు తెగించినవారు, డబ్బుకోసం భయంకర పోరాటం చేసేవారు.

రసదులు : బంధుప్రీతి లేనివారు, క్రూరులు, సోమరులు,




భిక్షుకి : ఏదైనా వృత్తి కోరువారు, దరిద్రులు, వితంతువ, ప్రగల్భాలు పలికెడి బ్రాహ్మణి అయిన పరివ్రాజిక, అంతఃపుర సత్కారాలను పొందుతూ, ఉన్నతోద్యోగుల యిళ్ళకు వెళ్ళివస్తూ, ఏ బంధువులూ లేనివారు, ప్రభుత్వంచే తప్పక పోషించ బడవలసిన వారు.

గూఢచారుల శాఖలలోని వారు అప్రమత్తతతో విధేయతతో, పరాయి దేశాలకు వెళ్ళి రహస్య సమాచారము లను తెలుసుకున్నట్లే తమ రాజు పరిపాలనలో మసలే పని వారి యొక్క రహస్య సమాచారములను తెలిసికొనుట గూఢచారి శాఖ వారి విధి.

రాజులు చారుచక్షులు, అంటే వారికి చారులే కళ్ళు. కళ్ళ ద్వారా అన్నిటినీ యెలాగ చూడగలుగుట (పైటి ప్రపంచాన్ని.) జరుగుతున్నదో చారులనే కళ్ళ ద్వారా రాజు తన రాజ్యమున జరుగుతున్న విషయములను, మంచి చెడ్డలను తెలుసుకోగలడు. ఇరుగు పొరుగు, విదేశ రాజ్యముల విషయములను గూడ గ్రహించగలడు, అవే ప్రభువు రాజ్యసుస్థిరతకీ పరిపాలనకు ఆధారము, బలము.

గూఢచారి వ్యవస్థ రాజునకు మాత్రమే నివేదించాలి. గూఢచారులు, మంత్రులు మారువేషాలతో వివిధ రాజ్యా లకు వెళ్ళి అక్కడి ఉద్యోగులకు లంచము లిచ్చిగాని, మాటల నేర్పుతోగాని, తమవారిగా చేసికొని, వారి క్రింద తమవారిని ఉద్యోగులుగా నియమింప చేయడం వంటివి చేసి అక్కడి గుట్టు మట్టులు తెలుసుకునే వారు.

యుద్ధకాలములో గూఢచారులు యెప్పటి కప్పుడు శత్రు చర్యల గురించి వార్తలందజేసేవారు. శ్రీరాముని సేనను తెలుసుకుందుకు రావణుడు శుకసారణులనే గూఢ చారులను సముద్రపుటావలి యొడ్డుకు పంపుతాడు.

ప్రతిజ్ఞాయౌగంధరాయణంలో తమ రాజును శత్రువులు తీసుకొని పోయి నప్పుడు మారు వేషములో పిచ్చివాని వలె నటించి తానే గూఢచారి చర్య జరిపి తమ రాజును విడిపించుకుని వచ్చాడు.

సైన్యాధికారులు ప్రతిరోజూ సైనికుల నొక్కొక్కరినీ పరిశీలించే వారట. ఆ విధంగా చర్య తీసుకోవడంవల్ల కొత్తవారు గాని, విదేశీయులు గాని వున్నదీ లేనిదీ తేలి పోతుంది. ఆ పరిశీలనలో అప్పుడప్పుడు శత్రు నివహం నుండి వచ్చిన గూఢచారులు దొరికిపోవడం కూడా జరుగు తూండేది.

ఏనాడూ రాజ్యపాలన రాజ్యాంగ పద్ధతులపైనే దేశాలు జరుపుతున్నాయి. తమ తమ రాజ్యాంగములు నిర్మించు కుంటున్నాయి.

కౌటిల్యుని, బార్హస్పత్యాదుల అర్థశాస్త్ర ప్రభావం మన భారతదేశ రాజ్యాంగముపైనే కాదు, ప్రపంచ రాజ్యాల రాజ్యాంగములపైనా లేకపోలేదు.

ప్రస్తుతం మన దేశంలో గూఢచారి వ్యవస్థలో గల కల్లోలము ఊహించినట్లయితే కౌటిల్యుని కాలములో గూఢచారి వ్యవస్థ యెంత పటిష్ఠంగా వుండేదో! దాని నాధా రము చేసుకుని ఆనాటి రాజులు తమ దేశములను పటిష్ఠంగా పరిపాలించ గలిగినట్లు, రామాయణంలో, భాసుని నాటక ములలో, ముద్రారాక్షసంలోనూ కనబడుతోంది.

ప్రస్తుత పరిస్థితులలో ఈ వ్యవస్థ పరిశీల ప్రధానమైనది గాను, అత్యంత కుతూహలముగాను వున్నదనే విషయం ప్రతి ఒక్కరూ గ్రహించ గలరు.



# కాంచనపు చెట్టు

— యస్. ఎన్. దుర్గారావు

ఈ కాంచనపు చెట్టు తెలుపు, ఎరుపు, పసుపుపచ్చ రంగులు కల పూవుల భేదముతో మూడు విధములుగా నున్నది. వీటి ఆకులు అడ్డాకును పోలియుండును. కాయలు పలుచగా బద్ద కట్టి పొడవుగా ఉండును. దీనికే దేవకాంచన మనే మరియొక పేరు కలదు. మరియు వీటిలో సువాసన గలది, సువాసన లేనిదియు కూడా కలవు. సువాసన గల దానికే "B. Canbida" అని పేరు. మిగతా వాటికి Bauhinia- veriegata, Bauhinia- Purperia అని పేర్లు. వీటి పువ్వులు యించుమించు సంపెంగ పువ్వులను పోలియుండును.

దీని గుణములను పరిశీలించిన చలువ చేయుననియు; వగరు రుచి గలదిగను, విపాకమున తీపి రుచిగా నుండుట తెలియవచ్చును.

దీనిని కూడా ఆయుర్వేదములో వాడుచున్నారు.

వీటి ఆకులు మరియు నెయ్యి, కలువ ఆకులు కలిపి సేవించిన బుద్ధి వికసించునని ' వాగ్భటుడు ' తెలిపెను. దేవ కాంచనపు చెక్క బియ్యపుకడుగుతో నూరి, శొంఠి చూర్ణము కలిపి సేవించిన గండమాలలు హరించునని ' చక్రదత్త ' లో తెలియపరిచారు. మరియు దీని చెక్క కషాయములో స్వర్ణమౌక్తిక భస్మము కలిపి సేవించిన మశూచి నశించును. దేవకాంచనపు వేరు చూర్ణము మజ్జిగలో కలిపి త్రాగిన మూల వ్యాధులు హరించును.

పచ్చ కాంచనపు చెక్క చూర్ణము, తాటి కలకండతో కలిపి తినిన శగలు కట్టును. ఎర్ర కాంచనపు చెక్క, తేనెతో కలిపి ఇచ్చిన రక్తప్రదరములు కట్టును.

దేవకాంచన పట్ట చూర్ణం 10 భాగములు, త్రికటు కములు 3 భాగములు, త్రిఫలములు 6 భా॥, ఉలిమిడి చెక్క 1 భా॥, ఏలకులు, లవంగాలు, జాపత్రి ఇవి ఒక్కొక్కటి ముప్పావు భాగముల చొ॥న మరియు ఈ భాగముల




కన్నిటికీ సమానమైన శుద్ధి చేసిన మహిషాక్షి (గుగ్గిలపు చెట్టునుంచి కారెడి జిగురు), వీని నన్నిటని కలిపి పాకము బట్టి కుంకుడు గింజ పరిమాణము సేవించిన సమస్త కుష్ఠలు, వ్రణములు, గుల్మములు, భగంధరము, గండ మాలలు నివారణ యగును.

## హరిజనవాడను శుభ్రం చేస్తా

గాంధీజీ, అంటరానితనాన్ని అంతమొందించటానికై ఆయనే స్వయంగా పాకీ పని చేసే వారు. ఒకసారి గాంధీజీ వైస్రాయిని కలుసుకోవడానికి సిమ్లా వెళ్ళారు.

"మీకు ఒక్కరోజు వైస్రాయి పదవి ఇచ్చారనుకోండి, అప్పుడు మీరేంచేస్తారు" అని ఒక విదేశీయుడు అడిగాడు.

"వైస్రాయి భవనం ప్రక్కన వున్న హరిజనవాడలను శుభ్రం చేస్తాను" అని గాంధీజీ సమాధానం చెప్పారు.

"మీ వైస్రాయి పదవిని మరో రోజు పొడిగిస్తేనో"

"మరునాడుకూడా సరిగ్గా అపనే చేస్తా" అని తక్షణమే గాంధీజీ సమాధానం యిచ్చారు.

మరుసదొడ్డి గోడ నీడలో రొచ్చు గుంటల మధ్య నాలుగు ఎంగిలి మెతుకులు కతుకుతున్న హరిజనుని దీనత్వం చూస్తే గాంధీజీ మనసు కరిగి కన్నీరై కారిపోయేది.

# అల్లిక నేర్చిన దర్జీపక్షి




గూడు కట్టుకోవటం అనేది పక్షులకు మాత్రమే తెలిసిన విద్య. అలాగని అన్ని పక్షులు గూళ్ళు నిర్మించుకోవు. కోయిల తన జీవితకాలం మొత్తంలో ఒక్కసారికూడా గూడు కట్టుకోదు. మరికొన్ని పక్షులు ప్రకృతిలో కనిపించే చెట్టు తొఱ్ఱలను, రాళ్ళ పగుళ్ళను తమ ఆవాసాలుగా ఉపయోగించుకుంటాయి. ఇక గూళ్ళు నిర్మించుకునే పక్షుల విషయానికి వస్తే-ఒక్కొక్క పక్షి ఒక్కో విధంగా గూడును నిర్మించు కుంటుంది. గూటిని చూసి అది ఏ పక్షి జాతికి సంబంధించిందో చెప్పవచ్చుకూడ.

చిన్న చిన్న దారపు పోగులను, గడ్డి పోచలను, నార పోగులను ఉపయోగించు కుంటాయి పిచ్చుకలు తమ గూడు నిర్మాణంలో. ఎండు పుల్లలను చెట్ల కొమ్మల మధ్యలో అనువుగా పేర్చి అందులో గుడ్లు పెట్టటం కాకుల ప్రత్యేకత. మరికొన్ని పక్షులు గుబురుగా వుండే పొదకు కొంచెం మార్పులు చేసి గూడుగా రూపొందిస్తాయి. వీటన్నిటికి భిన్నంగా ఎంతో నైపుణ్యంతో గూటిని అల్లుతుంది దర్జీపక్షి.

గుడ్లు పెట్టే సమయానికి ముందుగా మాత్రమే గూటి నిర్మాణం గురించి ఆలోచిస్తుంది ఈ పక్షి. ముందుగా గుబురుగా ఆకులున్న పెద్ద చెట్టును వెతుకుతుంది. ఆ తరువాత ఎంతో జాగ్రత్తగా వెతికి ఆరోగ్యంగా వున్న రెండు పెద్ద ఆకులను ఎంపిక చేసుకుంటుంది. ఎంపిక చేసుకున్న ఆకుల అంచులలో తన పదునైన ముక్కుతో రంధ్రాలు చేస్తుంది. ఇక అక్కడ నుంచి సమీపంలో వుండే సాలె గూళ్ళ కోసం వేట ఆరంభిస్తుంది. సాలీడును చంపి దాని గూడు తాళ్ళను తీసుక వస్తుంది. ఒక చివర ముడి వేసి రెండో వైపును జాగ్రత్తగా మిగిలిన రంధ్రాలన్నింటిలోంచి అల్లుతుంది. ఆకుల రెండు అంచులను దగ్గరకు చేర్చి కుట్టి దారపు రెండో చివరను ముడి వేస్తుంది.

డాక్టర్ దుగ్గరాజు శ్రీనివాసరావు

ఆ విధంగా దగ్గరకు చేరిన ఆకులలో గడ్డిపోగులను పేర్చి గూడు తయారు చేసి గుడ్లు పెడుతుంది. దర్జీపక్షి నిర్మించే ఆ గూటిలో రెండు మూడు పిల్లలు సుఖంగా జీవించగలవు.

ఇంత చాకచక్యంగా గూడు అల్లగల శక్తి ఈ పక్షికి ఎలా వచ్చింది అనే విషయం శాస్త్రజ్ఞులకు అంతు బట్టటం లేదు. ఇతర దర్జీ పక్షులు గూడు అల్లుతుండగా చూసి నేర్చుకుంటాయా ! అంటే కాదనే చెప్పాలి. మరి గూడు అల్లికకు సంబంధించిన నిపుణత ఆ పక్షి ' జీన్స్ ' లోనే వుందా ! ఏమో పరిశోధకులు తేల్చాలి భవిష్యత్‌లో. ★

# పంచమ వేదమును ప్రపంచాని ప్రసాదించిన మహర్షి వేదవ్యాసుడు

## డా॥ దివాకర్ల వేంకటావధాని

ప్రపంచ వాఙ్మయములో మహా భారతము వంటి గ్రంథము మరొకటి లేదు; దానికి పంచమ వేదమను పేరు సార్థకము. దానిని ప్రపంచమునకు ప్రసాదించిన వాడు వ్యాసుడు. వ్యాసుడనునది పేరు కాదనియు బిరుద నామమనియు కొందరందురు. అతనికి కృష్ణద్వైపాయనుడనియు వేదవ్యాసుడనియు, బాదరాయణుడనియు మరి కొన్ని పేర్లు కలవు. ఏకరాశిగానున్న వేదమును నాలుగు రూపములుగ విభజించుటచే అతనికి వేదవ్యాసుడని పేరు కల్గినది. నల్లని వర్ణము కలవాడగుటచే కృష్ణుడనియు, యమునానదీ ద్వీపమున పుట్టియుండుటచే ద్వైపాయనుడనియు, బదరీవనమున నివసించుటచే బాదరాయణుడనియు, కూడ అతనిని పిలుచుచుందురు. అతడు మహాభారతమునే కాక బ్రహ్మసూత్రములను పదునెనిమిది పురాణములను కూడ రచించెను. భారతీయ సంస్కృతికి అతనిని పితామహుడని చెప్పవచ్చును. అతడు లేనిచో మహాభారతము కాని, కౌరవ పాండవులు కాని, మహాభారత సంగ్రామము కాని యుండెడివి కావు. పోతన వచించినట్లు అతడు భారతీ వంశ వివర్ధనుడు. నిజమునకతని జననము తోడనే మహాభారతము ఆరంభమగుననుట యుక్తము. "తథోపరిచరాద్యన్యే" అను వాక్యమునకు అర్థమిదియే.

పరాశర మహర్షి యమునా నదిని పడవపై దాటునపుడు పడవను నడుపుచున్న దాశకన్యకును అతనికిని యమునా నదీ ద్వీపముపై వ్యాసుడు జన్మించెను. పుట్టగానే అతడు పెద్దవాడై తల్లితో "అమ్మా! నీవెప్పుడు నన్ను తలచెదవో, అప్పుడు వచ్చి నిన్ను దర్శింతు" నని చెప్పి ఆమె అనుమతి గైకొని తపస్సునకు వెడలిపోయెను తరువాత దాశకన్యను (సత్యవతిని) శంతను మహారాజు పెండ్లియాడెను. వారికి చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అను పుత్రులు పుట్టిరి. శంతనుడు సత్యవతిని పెండ్లియాడుటకు ముందే గంగాదేవి యందు దేవవ్రతుడను భీష్ముని గాంచెను. తండ్రికి సత్యవతిని పెండ్లిచేయుటకై భీష్ముడు రాజ్యము వదలుటే కాక వివాహము చేసికొనని కూడ ప్రతిజ్ఞ గాంచెను. అతడు అంబిక, అంబాలిక అను కాశీరాజ కన్యలను తెచ్చి తన తమ్ములకు వివాహము చేసెను. కాని వారు సంతానము కలుగుటకు పూర్వమే మరణించిరి. అందుచే భరత వంశమంతరించునేమో అని భయపడి సత్యవతి తన పెద్ద కుమారుడైన వ్యాసుని తలపోసెను. వ్యాసుడరుదెంచి ఆమె ఆనతి వలన అంబిక యందు ధృతరాష్ట్రుని, అంబాలిక యందు పాండురాజును, ఒక దాసీ స్త్రీ యందు విదురుని గాంచి వెడలి పోయెను. ధృతరాష్ట్రుని కుమారులు ధార్తరాష్ట్రులు లేక కౌరవులు. పాండురాజు కుమారులు పాండవులు. దాసీ పుత్రుడు విదురుడు. పాండురాజు పాండవులు బాల్యమునందున్నపుడే ముని శాపమున అడవిలో మరణించెను. పాండవులు హస్తినాపురమునకు వచ్చి ద్రోణునుండి విలువిద్య నభ్యసించిరి. ధృతరాష్ట్రుడు మంచివాడే కాని దుర్మార్గులైన కౌరవులు పాండవులను పెక్కు విధముల హింసించినను ఉపేక్ష వహించి ఊరకుండెను. దుర్యోధనుడు ధర్మరాజును

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

# క్రోధన

డా॥ వేమూరి వేంకటరామనాథం
(నైరోబి)

నవ పల్లవ మాలల మా
ధవ సల్లలి తోరు శరవితాన ప్రణయా
రవముల, హిమకణ విలసిత
రవి కిరణారుణ నిరుక్తి రమ్మ య్యుగాదీ.

ముల్లే గులాబి ద్రుంచు * బ్రు
హల్లీలా క్రౌర్య నేమియో రక్తాక్షిన్
చెల్లెలి వయ్యును క్రోధము
వెల్లువగా పాగనంపవే చ్యుత సంధ్యన్.

ఇదెకాక, క్రోధనవుగా,
వదేపనిగ పీడ గ్రక్కు నాకలిమారిన్
కొదుకక మ్రింగెడు మిత్తిని
వదల్చ గలవే దృగంత వయ రూక్షణతన్?

వెలిగిన వివియే సంజలు,
కల కంఠము లివె శకుంత గళముల విన్నన్;
నిలువని యనంత చక్రిము
మెలి యాకుల నొందె క్రొత్త మెఱయును నీపై

నీ విశ్వ గవేషణ గా
భూవలయ మ్మందు తెల్పవో స్ఫుట రుతిగా
దైవము పరస్పరత్వమె
కోవెల నిజ హృదయ మంచు, క్రోధన, ప్రజకున్.

(* ఇందిరా హత్యను గూర్చి)

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

ద్యూతమున కాహ్వానించి శకుని సాహాయ్యమున అతనిని ఓడించెను. జూదమునందు చేసికొన్న నియమము ననుసరించి పాండవులు పండ్రెండేండ్లు వనవాసము ఒక ఏడు అజ్ఞాతవాసము చేయవలసి వచ్చెను. ఇది విని వ్యాసుడు హస్తినాపురమున కరుదెంచి ధృతరాష్ట్రుని మందలించెను. అతడు విదురుని కూడ కౌరవుల కేల హితము చెప్పలేదని యడిగెను. విదురుడు దుఃఖించుచు ప్రేమ హితము చెప్పినను వారు వినలేదని తెలిపెను. వ్యాసుడు ధృతరాష్ట్రుని వంక కోపముతో చూచి "నీవు పుత్రుని యందలి మమత్వముచే పాండవులకు కీడు జరుగుచున్నను ఉపేక్ష వహించితివి. ఇందువలన నీ వంశమునకే కీడు రానున్నది భగవంతుడైన కృష్ణుడు పాండవుల పక్షమున నుండుట నీవు మరచితివి కాబోలును" అని పలికి వెడలి పోయెను.

వ్యాసుడు అడవిలో నున్న పాండవులను చూచుటకు వచ్చెను. పాండవులతనినెంతో గౌరవించిరి. ద్రౌపది యతనికి నమస్కరించి తన కడగండ్లు చెప్పుకొని విలపించెను. వ్యాసుడామెను చూచి జాలిపడి "అమ్మా ఈ కష్టములు కలకాలముండవు. ధర్మము జయించును. అధర్మము పరాజయము పొందును. పాండవులు వీరులేకాక ధర్మాత్ములు, వారు కౌరవులను సంహరించుటకే జన్మించి"రని పలికి యామెనోదార్చి వెడలిపోయెను.

వనవాసాజ్ఞాతవాసముల తరువాత దుర్యోధనుడు పాండవులకు రాజ్యమీయని కారణముచే కౌరవ పాండవులకు గొప్ప యుద్ధము జరిగెను. దీనికి కురుక్షేత్ర మహా సంగ్రామమని పేరు. ఈ యుద్ధము పదునెనిమిది రోజులు జరిగినది. మొదటి పది దినములును కౌరవ సేనకు భీష్ముడు సేనాపతిగా నుండెను. కౌరవ పక్షమునందలి బంధువులను గురువులను మిత్రులను చూచి అర్జునుడు వారితో యుద్ధముచేయుటెట్లని విషణ్ణుడై రథముపై కూలబడెను. అప్పుడే కృష్ణుడు భగవద్గీత చెప్పి అర్జునుని కార్యోన్ముఖు నొనరించెను. ఈ భగవద్గీత యందు పదునెనిమిది అధ్యాయములు కలవు. ఇంత గొప్ప గ్రంథము

మరియొకటి లేదని ప్రపంచమునందలి మేధావులందరును అంగీకరించిరి. దీనిని రచించినవాడు వ్యాస మహర్షియే. అది ఉపనిషత్ సారము; బ్రహ్మ విద్య; యోగ శాస్త్రము.

కురుక్షేత్ర యుద్ధము చివరినాటి రాత్రి భీముని గదా హతిచే భగ్నోరుడై దుర్యోధనుడు నేలగూలెను. అప్పుడు ధృతరాష్ట్రుడు వచ్చి విలపించుచుండగా వ్యాసుడు వచ్చి అతనిని "నీ కుమారుడైన దుర్యోధనుడీ ఆపదను చేసేతుల తెచ్చుకొనెను. కర్మమనుభవింపక తప్పదు. నీ వింటికేగి పాండవులను నీ కుమారులవలె చూచుకొను" మని అనునయించెను. గాంధారి మహా పతివ్రత. పుత్ర-మరణ శోకముచే ఆమె పాండవులను శపించుటకు సిద్ధముగ నుండ వ్యాసుడరుదెంచి ఆమెనోదార్చి శాపమీయకుండ చేసెను. ధర్మరాజు యుద్ధమున పలువురు మరణించుటచే విషాదము పొంది రాజ్యత్యాగము చేయుటకు సిద్ధపడెను. అప్పుడు వ్యాసుడరుదెంచి "నాయనా! నీవు దుఃఖింపకుము. నీవు ధర్మాత్ముడవు. నీ సోదరుల తోడను మిత్రుల తోడను సుఖముగ రాజ్యము చేయవలసి యుండగ దుఃఖించెదవెందులకు? నీవు క్షత్రియుడవు. పిరికి తనము వహింపరాదు" యని చెప్పి అతనికి శంఖ-లిఖితుల కథను, దేవరాక్షసుల కథను, షోడశ మహారాజు కథను తెల్పెను. తరువాత అతడు ధర్మరాజు అధర్మము చేయలేదనియు, తన ధర్మమును యథావిధిగా నిర్వహించెననియు ఎరిగించెను. ధర్మరాజు అభిమన్యునిగూర్చి విచారింపగా వ్యాసుడు అభిమన్యుని పరాక్రమమును పొగిడి అతడు మరణించినను అతని కీర్తి శాశ్వతముగ నిలచునని చెప్పి అతనిని ఓదార్చెను. అట్లే అతడు సుభద్రార్జునులను కూడ ఊరడించెను. తరువాత నతడు ఉత్తర వైపునకు తిరిగి "అమ్మా! నీ కడుపున ఒక మహా వీరుడుదయించి పాండవ వంశమును కొనసాగించును. దుఃఖింపకు"మని ఓదార్చెను. మహర్షి మాటలు విని యుధిష్ఠరుడు కూడ శాంతించి రాజ్యపాలన మగ్నుడయ్యెను. ఈ విధముగ వ్యాసుడు ఆయాసమయములందు దరుదెంచి పలువురికి ధర్మమార్గము నెరింగించెను. తరువాత అతడు తన ఆశ్రమమునకరిగెను.

> "అభిమన్యునిలా పోరాడటం మానుకోవాలి. కుర్రతనంగా ప్రవర్తించరాదు. దూర దృష్టితో, మెళకువగా నడుచుకోవడం నేర్చుకోవాలి. అభిమన్యునిలోని ధైర్య సాహసాలను అలవరచుకోవాలి."
>
> - హరి సర్వోత్తమరావు

ధృతరాష్ట్రుడును, గాంధారియు, కుంతియు వార్ధక్యము పొంది వనవాసమున కరుగ నిశ్చయించిరి ధర్మరాజు మొదట అంగీకరింపక పోయినను తరువాత వారి వనగమనమున కనుమతించెను. ఈ విషయమెరింగి వ్యాసుడు వచ్చి వారిని తమ ఆశ్రమమునకు గొనిపోయెను. గాంధారీ ధృతరాష్ట్రులు మరణించిన తమ కుమారులను, కుంతి కన్నెగా నున్నప్పుడే తనకు పుట్టిన కర్ణుని చూడవలెనని వాంఛించిరి. వ్యాసుడు పాండవులకుకూడ కబురంపెను. అర్ధరాత్రి సమయమున వ్యాసుడు గంగాజలమున నిలబడి చనిపోయిన వీరులందరినీ పేరు పేరున పిలిచెను. వారందరును ఒకరొక్కరే వచ్చి నిలబడిరి. పాండవులును ధృతరాష్ట్రాదులును మృతులైన వారిని చూచి అమందమైన ఆనందమును పొందిరి.

ముప్పదియారు సంవత్సరములు గడచినవి. కృష్ణుడు అవతారము చాలించిన వార్త విని అర్జునుడు దుఃఖించుచు వ్యాసుని చూడబోయెను వ్యాసుడతని చూచి "నాయనా! కృష్ణభగవానుడు ధర్మ సంస్థాపనమునకై అవతరించెను. అతడు వచ్చిన పని ముగిసెను. ద్వాపరయుగము ముగియ వచ్చుచున్నది. మీరు కూడ దేహత్యాగము చేయవలసిన సమయ మరుదెంచినది. ఈ సందేశము ధర్మరాజునకు తెలుపుము" అనిపలికి అతనిని పంపివేసెను వ్యాసుడీ విధముగ ధర్మాధర్మములను నిర్ణయించుచు చిరకాలము జీవించెను. సజ్జనులాతని గౌరవించిరి. దుష్టులు ఆతని

చూచి భయపడిరి. తపోయోగ బలముచే అతడు జరామరణములను జయించెను.

మహాభారత యుద్ధము జరిగిన కొన్ని సంవత్సరములకు బ్రహ్మ వ్యాసుని ఆశ్రమమునకు వచ్చి "మహర్షీ! నీవు మహాభారతయుద్ధమంతయు చూచితివి. అందు పాల్గొనిన వీరులందరిని ఎరుగుదువు. అందుచే మహాభారతకథను గ్రంథ రూపమున వ్రాయు"మని కోరెను. వ్యాసుడందుకు అంగీకరించి నేను చెప్పుచుండగ వ్రాయగల లేఖకుడు కావలెనని కోరెను. బ్రహ్మ గణేశ్వరుని పేరు సూచించెను. తరువాత బ్రహ్మ సంకల్పము ననుసరించి గణేశ్వరుడు వ్యాసుని దర్శించి మహాభారత గ్రంథమును చెప్పుటకు అరంభింపుమని కోరెను. వ్యాసుడు మొదలు పెట్టుచుండగా గణేశుడు "నీ చెప్పుటను ఆగకుండ చెప్పవలెను. నీవాగినచో నేను వ్రాయుట మాని వెళ్ళిపోయెదను" అని పలికెను. వ్యాసుడంగీకరించి "నీవు నేను చెప్పినదంతయు అర్థము చేసికొని వ్రాయవలె"నని నియమము పెట్టెను. గణేశ్వరుడంగీకరించెను. వ్యాసుడు చెప్పుచుండగ గణేశ్వరుడు ఆలస్యము చేయకుండ గ్రంథమంతయు వ్రాసివేసెను.

గణేశ్వరుని వేగము నాపుటకై వ్యాసుడు అచ్చటచ్చట అతి కఠినమైన శ్లోకములు చెప్పుచుండెను. అతడు అర్థము చేసికొని వ్రాయుటకు మొదలుపెట్టునంతలో వ్యాసుడెన్నో శ్లోకములను స్వగతమున ఆలోచించుకొనుచుండెను. ఆ కఠిన శ్లోకములను గ్రంథగ్రంథులు, లేక వ్యాసుని హస్యములు అని చెప్పుదురు.

వ్యాసుడు గణేశ్వరునికి భారతము చెప్పుచుండగ అతని శిష్యుడైన వైశంపాయనుడు వినెను. జనమేజయుడు ఒనర్చిన యాగములో వ్యాసుని అనుమతి ననుసరించి అతడు మహాభారత కథను చెప్పెను. అతని కుమారుడైన ఉగ్రశ్రవుడు నైమిశారణ్యమున భారతమును శౌనకాది మహర్షులకు చెప్పెను. ఈ విధముగ మహాభారత కథ పలుచోట్ల వ్యాపించెను. మహాభారతమున లేని జ్ఞాన విషయము లేదు. అది విశ్వ విజ్ఞాన కోశము. వ్యాసుని సూర్యునితో పోల్చినచో భారతమును సర్వవ్యాపకమైన సూర్యకాంతితో పోల్చవచ్చును. ★

# ఇండోనేషియాలో భారతీయ సంస్కృతి

ప్రముఖ భారతీయ చరిత్రకారుడు డాక్టర్ రఘువీర ఒక పర్యాయం ఇండోనేషియా ప్రెశిడెంట్ 'సుకర్నో'ను కలవగా 'నా పేరుకు అర్థమేమిటి?' అని ఆయన ప్రశ్నిస్తాడు. అప్పుడు డా॥ రఘువీర "ఆదిలో 'సుకర్ణ' అయివుండవచ్చును. బుద్ధుని విగ్రహమునకు చెవులు పెద్దవిగా వేయుదురు. కావున ఇది బుద్ధుని పేరై వుండవచ్చును" అని బదులు చెప్పినాడు.

సుకర్నో నవ్వి "అట్లు కాదు. నేను నా తల్లి గర్భంలో వుండగా నా తండ్రి ప్రతిదినం మహాభారతం చదువుతుండే వాడుట. భారత వీరుని పేరు పెట్టాలని నా తండ్రి ఆలోచనట భారతంలో ఆయనకు కర్ణుడు బాగా నచ్చాడట. అయితే భారతంలోని కర్ణుడు దుష్ట చతుష్టయంలోని వాడు. నా కుమారుడు దుష్టకర్ణుడు గాక 'సు' కర్ణుడుగా వుండవలెనని తలంచి నా తండ్రి నాకు 'సుకర్ణో' అని పేరు పెట్టినాడుట" అని చెప్పెను.

ఇండోనేషియా ప్రభువులు మతరీత్యా మహమ్మదీయులే అయినప్పటికి భారతీయ సంస్కృతీ ప్రభావం వుండటం విశేషం.

(20వ పేజీ తరువాయి)

మాయలు పన్నుతారు. ప్రచారాలు చేస్తారు. ఈ మాయా జాలాలలో చిక్కుపడి పోకుండా; ప్రజలు తాము కోరింది సాధించుకోవడం జరగకపోతే ప్రజలు ఓడినట్లా గెల్చినట్లా? తాము ఎన్నికల ద్వారా ఎట్టి జాతీయ ప్రజాస్వామ్యాన్ని ఆశిస్తున్నారో అందుకు తగ్గట్లు ప్రజలు ఓటు వేయలేకపోతే — తాము ఓడినట్లా గెల్చినట్లా? వీనిని ఎవరికివారికి ప్రశ్నలుగానే వదిలి వేద్దాం. 35 సంవత్సరాల స్వరాజ్యం తర్వాతనయినా ప్రజలు ఈ ప్రశ్నలు వేసుకోవడం న్యాయం.

ఎన్ని లోటుపాట్లు ఉన్నా మొత్తంమీద ప్రజలు విజ్ఞతలోనే వోటు చేశారనాలి. అయితే ఆ విజ్ఞత ఎక్కువగా స్వప్రయోజనాల పరిధిలోనే ఉంటున్నదేమో? ఈ స్వప్రయోజనాలు రక రకాలుగా ఉంటాయి. గనుక ఉమ్మడి పర్యవసానాలు ఆశించిన జాతీయ, ప్రజాస్వామిక జీవనానికి అనుగుణంగా లేకపోవడం, ఫలితాలు కొంత అనూహ్యంగా ఉండడం జరుగుతున్నదేమో? ప్రజలు ఉమ్మడి జాతీయ, ప్రజాస్వామ్య జీవనానికి అనుగుణమైన పద్ధతిలో వోటు చేయడానికి అలవాటు పడితే ఫలితాలు ఇంత కన్నా మరింత నిశ్చితమైన స్థితిలో, ఉమ్మడిగా తాము కోరేదిశలో ఉంటాయేమో? ఇవి కూడా ఆలోచించుకోదగిన ప్రశ్నలే.

## కొత్తఘట్టం

ఏమైనా ఇటీవలి ఎన్నికలతో దేశం కొత్త ఘట్టాన్ని ప్రవేశిస్తోంది. ప్రవేశించింది. ఈ అన్ని ఎన్నికల్లోను చాలా అనుభవాలు వచ్చాయి. మన ఎన్నికల వ్యవస్థలోని లోపాలు కూడా వ్యక్తమయినాయి. ప్రజల ఓట్లకు, ప్రజా ప్రతినిధి సభల్లో సీట్లకు పొంతనలేదు అనేది పదే పదే స్పష్టమయింది. కాంగ్రెసుకు దేశం మొత్తం మీద లోక్‌సభ ఎన్నికల్లో 49 శాతం ఓట్లు వస్తే, ఈసారి 26 శాతం ఇంకా తగ్గింది. కాని గట్టిగా మూడు రాష్ట్రాల్లో మినహా సర్వత్రా కాంగ్రెసు (ఐ) పాలనే ఉంది. ఈ అంతరం తగ్గించే మార్గాలు, పద్ధతులు అవలంబిస్తే తప్ప మెరుగయిన ప్రజాస్వామ్యానికి మరింత చేరువకాము. ఈ మధ్య పార్టీమార్పిడి నిషేధం చట్టం చేయబడింది. దాని మంచి చెడ్డలటుండగా..ఇప్పుడున్న అసంతులన స్థితికి సీలు పడిందనేది స్పష్టం. పెద్ద చీలికలొస్తే తప్ప చిల్లర మార్పిడీల అవకాశాలు తక్కువవుతాయి. మరో విషయం; ఈ చట్టం ద్వారా పార్టీ అంటే కేవలం లెజిస్లేచరు పార్టీయే --- స్థితి ధృవపడింది. ప్రజల మధ్య పార్టీకి వేరే అస్తిత్వం దాదాపు ఉండని స్థితి, ఇలాంటి పరిణామమూ ద్యోతకమవుతోంది.

## సమస్యలపై చర్చయే ఉండదా?

అటు ప్రజా ప్రతినిధిసభల్లో బలమైన ప్రతిపక్షం లేక, ఇటు ప్రజలమధ్య బలమైన పార్టీ కార్యక్రమాలు లేక, పత్రికయా నోరు మెదపక, ఇక వేరే బలమైన సంస్థలు లేకపోతే-సమస్యలను గురించిన చర్చ లేని స్థితి వస్తుందా? అది మంచిదా? ప్రయోజనకరమా? కొత్తఘట్టం వచ్చినందుకు సంతృప్తిపడి ఊరుకొనదగి ఉందా? లేక ఈ కొత్త పరిస్థితిని గురించి ఆలోచించదగి ఉందా?

## ప్రతిపక్షం పాత్ర ఎవరు నిర్వహించాలి?

నేడు బయట ఉన్న ప్రజలే ప్రతిపక్షంగా నిలిచి ఆలోచించుకోవడం అవసరమేమో! ప్రజలు అంటే-మామూలు ప్రజలు, మేధావులు, పత్రికలు, ప్రజా ప్రతినిధి సభల్లో లేని రాజకీయ నాయకులు తదితరులు..ఈ లోటును భర్తీచేయడం చాలా అవసరం అనిపిస్తుంది. అంతేకాదు. లోక్‌సభ, శాసన సభలకే ప్రజాస్వామ్యం పరిమితం అని భావించక—మరి ఇతర అన్ని స్థాయిలలోనూ, కార్పొరేషన్లు, మున్సిపాలిటీలు, పంచాయతీలు వగైరా ఎన్నికలు అన్నిటిలోను ఎక్కడికక్కడ ప్రతిపక్షాలకు ప్రాముఖ్యం ఇస్తూ ప్రజాస్వామ్యంలో మొత్తంమీద సంతులనం తెచ్చుకునే ధోరణి ప్రస్తుత స్థితిలో వాంఛనీయం.

★ ★ ★

**అలారం గణగణ మని మ్రోగింది. ఉలిక్కిపడి లేచాడు ప్రభాకర్ హడావుడిని వ్యక్తపరుస్తూ !**

**అతనితోపాటే లేచింది అతని భార్య పద్మ సంభ్రమాశ్చర్యాలతో అర్థంగాని అయోమయపు అవస్థలో. అలారం టైంపీస్ వైపొకమారు చూచింది అసంతృప్తిగా!**

ఏ ఒకరి అనుభూతులకు, అనుమానాలకు, అసంతృప్తికి ఆగవలసిన పని తనకేం లేనట్లు తెల్లవారు ఝామున 4-30 ని హెచ్చరించి 4-31 ని కల్సుకోబోతున్నది గడియారంలోని పెద్దముల్లు.




వాతావరణం చాలా నిర్మలంగానూ, ప్రశాంతంగానూ వుంది. అందుకే ఎక్కడో దూరంగా "కొక్కొరోకో" అనే కోడి కూతలు, రోకటి పోట్లు, జరజరమనే చీపుర్ల సరాగాలకు తాళం వేస్తున్నట్లు పేడ కళ్ళాపుం చప్పుళ్ళు అస్పష్టంగా వినిపిస్తున్నాయ్. పొలం పనికి పోయే కమతగాళ్ళ అదిలింపులకు మెడలోని మువ్వల మ్రోతలతో వొంటిపై వాలిన గోమార్లను విదిలించుకుంటు కదిలి పోతున్నాయి చతుష్పాద జంతువులు.

అల్లంత దూరాన శ్రీ వెంకటేశ్వర ఆలయంలో సుప్రభాతంతో పాటు అక్కడి మామిడి చెట్టుమీద కుహూ ....కుహూ రవాలతో వంత పలుకుతూ మేలు కొలుపులు పాడుతున్నాయి కోయిల జంటలు. అన్నీ వున్న ఆ ఆధునిక ఆదర్శగ్రామంలో విధి నిర్వహణను హెచ్చరిస్తూ గుడిలో గంటలు గణ గణ మ్రోగుతున్నాయ్.

ఈ ప్రకృతి వాతావరణాన్ని కలుషితం చేస్తూ "పద్మా! లేచి నీళ్ళు కాచి కాఫీ త్వరగా పెట్టు" హుకుం జారీ చేసి టూత్ బ్రష్‌తో స్నానాల గది వైపు వెళ్ళిన ప్రభాకర్‌ని చూస్తూ ఆశ్చర్యపడింది పద్మ. తన కండ్లను, చెవులను తనే నమ్మలేకపోయింది. కలను కంటున్నానేమోననే అనుమానంతో చేతిని గిచ్చుకొని "అబ్బా" అనుకుంది. ముఖంలో క్వశ్చన్ మార్కు విలయతాండవం చేస్తున్నది. "ఏమిటీ విపరీతం ! తను కాపరానికి వచ్చిన యీ ఆరు మాసాలలో ఎన్నడూ జరగని సంఘటన. కలయో వైష్ణవమాయయో అన్పటుంది. ఎలాగో బ్రతిమిలాడించుకొని బ్రతిమిలాడించుకొని తప్పని సరైతె ఎనిమిది గంటలకు గానీ నిద్రలేవని ప్రభాకర్ ఈనాడిలా తెల్లవారు ఝామునే లేచాడంటే ప్రపంచానికేదో ముప్పు వాటిల్లనున్నదని భయపడింది. ఏదో విశేషం వుండి వుండాలి. ఏమిటబ్బా అది ? ఏదైనా వూరు వెళ్ళాలా ? ఆఫీసు పని మీద క్యాంపు వెళ్ళాలా ? ఏదైనా ముందుగా తనతో చెప్పేవాడేనే ! " ఇలాంటి ప్రశ్నల పరంపరలతో సతమత మౌతున్న పద్మకు "ఎందుకండి అంత తొందర" అని అడిగే సాహసం లేకపోయింది. పెద్దల సూక్తులు ఆమె గొంతుకలో పచ్చి వెలక్కాయల్లాగా అడ్డం పడ్డాయి. ముందుగా అడిగితే వెళ్ళే పని కాదేమో అన్న భయంతో మాట్లాడకుండా కార్యక్రమంలోకి అడుగు పెట్టింది.

స్నానం చేసి కాఫీ ముగించుకొని టిప్‌టాప్‌గా తయారయి సూర్యోదయానికి పూర్వమే ఇంటి నుండి బయటపడ్డాడు ప్రభాకర్.

ఎలాగూ పెందలకడనే నిద్ర లేచింది కనుక తన దైనందిన కార్యక్రమాలలో నిమగ్నురాలైంది. కానీ తన సందేహం గూడు కట్టుకొని అలాగే మనస్సులో వుండిపోయింది. ఇంతవరకు తన వద్ద ఏదీ దాచని తన భర్త ఈ నాడు తనకు ఏ విషయమూ చెప్పకుండా బయటకు వెళ్ళి పోవడంతో తన వ్యక్తిత్వం పెత్తి పడ్డట్లుగా ఫీలయింది. పరధ్యాన్నంగానే పనులన్నీ ముగించుకొని కాలక్షేపం కోసం వార పత్రిక తిరగేస్తూ కిటికీ ప్రక్కనే కూర్చుంది పద్మ.

అప్పటికి సుమారు ఎనిమిది గంటలు కావస్తుంది "ప్రభాకర్‌గారు" అన్న పిలుపుతో ఉలిక్కిపడి పుస్తకం ప్రక్కనున్న టేబుల్‌పై పడేసి వరండాలోకి వచ్చింది "ఎవరా ?" అని ప్రశ్నార్థకంగా చూస్తూ.

"ప్రభాకర్ గారు లేరా అండీ ?" అవతలి గొంతుక అర్థించింది వినయంతో.

"లేరండీ ! ఈ రోజు ఏవో పనిమీద పెందలకడే బయటికి వెళ్ళిపోయారు.... పనేదైనా వుంటే చెప్పండి రాగానే చెప్తాను." మృదువుగా సమాధానం చెప్పింది పద్మ.

"ఏమీ లేదండి ! మళ్ళీ వస్తాను" నిరాశారేఖలు అతని ముఖంలో తాండవం చేశాయి. సమాధానం చెప్పి వెనక్కి తిరిగాడేగానీ అతని మెదడు ఆలోచనలో పడింది ప్రభాకర్ ఇంట్లో హడావుడి లేకపోయేసరికి.

"ఐనా కాసేపు చూద్దాం ! అంతవరకూ అటొకరౌండు కొట్టి వద్దాం" సమాధాన పర్చుకుంటు వెళ్ళిపోయాడు. ఆ తరువాత ఐదునిముషాలకు మరొక వ్యక్తి అదే పిలుపు—అదే ప్రశ్న—తిరిగి అదే సమాధానం. ఆ తరువాత ఇంకొకరు—వారి తరువాత మరి ఒకరు అవే ప్రశ్నలు—అవే సమాధానాలు.

అరగంటలో ఆరుగురు అవతరించారు.



అరిగిపోయిన గ్రామఫోను రికార్డులాగా అవే ప్రశ్నలు—అవే సమాధానాలు. పెట్టేవారికి లేకపోయినా వినేవారికి విసుకు కలగదూ....! ప్రశ్నలు అడిగేవారు వేరువేరైనా ఒకే సమాధానం చెప్పలేక తల దిమ్మెత్తి పోయిందామెకు. అంతా ఒక్కసారే కట్ట కట్టుకొని వచ్చారేమిటా ? అని అయోమయంగా ఉంది. "ఎన్నడూ లేనిది ఈనాడెందుకిలా ఒకరి తరువాత ఒకరు ఇంటర్వ్యూకు వచ్చినట్లుగా వస్తున్నారు ? తన భర్తతో ఏదైనా పని వుండి వస్తున్నారా ? లేక బాకీ ఏమైనా పడ్డారా ?" అతని ప్రవర్తనలో మార్పు కన్పించక పోయినా అనుమానం అంకురించింది పద్మ హృదయంలో. బాకీ పడవలసిన అవసరం తమకు లేదు. నెలకు వచ్చే ఐదువందల రూపాయలతో ముచ్చటగా కాపురం నెట్టుకొస్తుంది. చెడు అలవాట్లు, దుబారా ఖర్చులు అసలే లేవు. కనుక బాకీ అయివుండదు. నిర్ధారణ చేసుకొన్నది పద్మ. "అయితే మరెందుకు ?" ఈ ప్రశ్నకు సమాధానం చిక్కలేదు. ఇదే ఆలోచన పద్మ మెదడులో పరిభ్రమిస్తూ ఉన్నది. కిటికీ చువ్వలగుండా ఊరి మధ్య నుండి పోయే కలకత్తా—మద్రాస్ ట్రంకు రోడ్డు రద్దీని తిలకిస్తూ ఆలోచిస్తోంది.

వీధి అంతా కోలాహలంగా వుంది. వచ్చేపోయే బస్సులు, కార్లు, రిక్షాలు, జన సమూహంతో రద్దీగా వుంది. ప్రతి ఒక్కరూ ఏదో పనిమీద కార్యసిద్ధికై ఆత్రుతగా పోతున్నారు. విరామం ఏ ఒకరి ముఖంలోనూ ప్రస్ఫుటం కావడం లేదు. అడ్డం వచ్చిన జంతు, జనాల చెవులు చిల్లులు పడేటట్లు హారన్ అదిలింపులతో తప్పించుకుంటూ పోతున్నారు లారీ డ్రైవర్లు.

ఆ జనసమూహంలో కొందరు బాలురూ వెల్లివిరిసే ఆనంద సందోహాలతో అల్లరిగా ఒకర్నొకరు అందుకోవాలనే ఆత్రుతతో అడ్డు వచ్చే శకట పరంపరలను సహితం లెక్కచేయకుండా పరిగెడుతున్నారు. వారి దుస్తులు మరకలతో నిండివున్నాయ్. కొందరి ముఖాలు సహితం మరకలతో పగటి వేషగాండ్లను మరిపిస్తున్నాయ్. వారి చేతులలో చిన్న చిన్న సీసాలు, ఫౌంటెన్ పెన్నులు కన్పిస్తున్నాయి. ఒకరిపై ఒకరు సిరా చల్లుకుంటూ ఆనంద డోలికల అవధులను దాటుతున్నారే గానీ ఖరీదైన బట్టలు పాడైపోతాయనే ధ్యాస ఒక్కరికీ లేదు.

పద్మ మెదడులో "తళుక్" మని మెరుపులాంటి ఆలోచన స్ఫురించింది. "ఈ రోజు ఏప్రిల్ ఫస్టు గదూ" తనలో తాను నవ్వుకుంది. అందుకే కాబోలు ఈనాడు తన భర్త ఆకస్మిక హడావుడి. అన్నట్లు ఇందాక వచ్చిన వారిని "ఏప్రియల్ ఫూల్స్"ని చేయటానికి కాదు గదా! ఇలా ఆలోచించుకుంటుండగానే మరలా పిలుపు.

ముందు వచ్చిన వారితో పాటు మరొక ఇద్దరు కూడా వారి జాబితాలోనే చేరినట్లున్నారు.

"ఇంకా ప్రభాకర్ గారు రాలేదా అండి?" తడపడుతూ ఒక గొంతుక అర్థించింది.

"లేదండీ! అటునుంచి ఆఫీస్కు వెళ్ళారేమో" సమాధానం చెప్పింది విసుగుదలను వ్యక్త పరచకుండా.

"ఈ రోజు తన బర్త్‌డే అని ఆఫీస్కు సెలవు పెట్టాడు" మరొక గొంతుక విషయం వెళ్ళగక్కింది.

"ఉదయం ఎనిమిది గంటలకు తన బర్త్‌డే పార్టీకి మమ్మల్ని ....ఆహ్వానించాడు." వేరొక గొంతుక నసిగింది.

పద్మకు విషయం అర్థమయింది. వారి వదనాలలోని నిరాశారేఖలకు జాలికలిగింది.

"అలా చెప్పారా మీకు ?....ఒక్క నిముషం అలా హాలులో కూర్చోండి ఇప్పుడే వస్తాను". సానుభూతి ధ్వనించే కంఠంతో కుర్చీలను చూపి లోపలికి వెళ్ళింది. భర్త విధించిన కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నట్లుగా....

ఒకరి ముఖాలు ఒకరు చూచుకోవడం మొదలుపెట్టారు. తలా ఒక కుర్చీలో కూర్చుంటూ. ప్రతి ఒక్కరి ముఖంలో క్వశ్చన్ మార్కు నాట్యం చేస్తున్నది లయబద్ధంగా.

లోపల స్టౌవ్ వెలిగించి పాలు కాచి "బ్రూ" కలిపి ఐదు నిముషాలలో అందరికీ కాఫీ అందించింది.

ప్రభాకర్ లేకపోవడంతో ఇబ్బందిగా కాఫీ పుచ్చుకుంటూ "మేడం! మీకు చాలా శ్రమ కలిగించాం" అందొక కంఠం కృతజ్ఞత వెలిబుచ్చుకుంటూ ఏదో ఒకటి అనాలిగదా యని.

"లేదండి!....మీరే క్షమించాలి. ఈ రోజు ఏప్రిల్ ఫస్టు గదండి! జీతం పుచ్చుకోవడానికి ముందుగా ఆఫీస్కు వెళ్ళి వుంటారు. అన్యథా భావించకండి" అంటూ అతి సూక్ష్మంగా వారి పరిస్థితిని వ్యక్త పరుస్తూ విచారంగా తలను వంచుకొని నేలను చూస్తూ వినయంగా సమాధానం చెప్పింది సానుభూతిని వ్యక్త పరుస్తూ.

తెల్లబోయి ఒకరి ముఖాలు ఒకరు చూచుకొన్నారు. ఏ ఒక్కరి ముఖంలోనూ నెత్తురు చుక్క లేదు. కొయ్యబారి పోయారు. ఐదు నిముషాలు పట్టింది షాక్ నుంచి తేరుకోవడానికి. నిశ్శబ్దం మరో రెండు నిముషాలు తాండవం చేసింది. అప్పటికి గానీ ఆరోజు ఏప్రిల్ ఫస్టు అన్న సంగతి, కన్పించిన వారిని ఫూల్స్‌ను చేసే పండుగ రోజని వారికి జ్ఞప్తికి రాలేదు. ప్రభాకర్ చేసిన మోసానికి అతణ్ణి మింగేద్దామనిపించింది. ఆడదాని ముందు ఫూల్స్ మయ్యామని అని విచారించినా పద్మ చూపిన సమయ స్ఫూర్తికి, గౌరవానికి ఎంతో సంతోషించారు.

" ఇంక శలవు తీసుకొంటాము " అంటూ పాలి పోయిన ముఖాలతో వెళ్ళిపోయారు.

అనుకోని ఈ సంఘటనకు పద్మ చాలా విచారించింది. ఆ సమయంలో తను అంతకన్నా చేయగలదు ?

" ఎవరు నిర్ణయించారోగానీ ఈ పద్ధతి అర్థం లేకుండా వుంది. చదువుకొనే విద్యార్థులకు వారి బాధ్యతలు గుర్తు చేయటానికని నిర్ణయించిన ఈ పద్ధతి చిన్నా, పెద్ద అందరికీ పరిపాటి అయిపోయింది. కొందరు తుంటరి గాండ్ల సరదాకు అనుకోకుండా ఎందరు అవమానాలు పొందవలసి వస్తున్నది. ఒక వేళ తను సరదా కొద్ది చేశాడనుకో ఇంటిమీదకు తోలటం దేనికి ఈ జనాన్ని......... అన్నట్లు వారితో పాటు నన్ను కూడా.... ఛీ–ఛీ ! ఏమిటీ ఈ పనులు. చేసే వారికి సరదాగా వున్నా ఫూల్స్ అయ్యే వారికి ఎంత బాధగా వుంటుంది ? " యిలాంటి ఆలోచనలతో సతమతమౌతున్న పద్మ ముఖం కొంతసేపటికి ఎందుకో వికసించింది.

రాత్రి పెందలకడే ఇల్లు చేరుకొన్న ప్రభాకర్ తన కెదురుగా చిరునవ్వుతో ప్రత్యక్షమయ్యే పద్మ కనిపించక పోవడంతో మనస్సు చివుక్కుమంది. ఇల్లంతా కళా విహీనమై బావురుమంటూ వుంది. తన ప్రతాపాన్ని కొండంతలుగా గొప్పగా భార్యముందు చెప్పాలని ఎంతో సంతోషంగా వచ్చిన ప్రభాకర్‌కు నిరాశయెదురైంది. ఆత్రుతగా "పద్మా ! .... పద్మా.... ! " అంటూలోనికి వెళ్ళాడు. పడకగది వైపు నుండి " వస్తున్నానండి " అనే హీనస్వరం వినిపించింది. అటు వైపు వెళ్ళిన ప్రభాకర్ పద్మను చూచి " ఏం పద్మా ! అలా వున్నావు ? "

" ఒంట్లో బాగాలేదండి " నీరసంగా సమాధానం చెప్పింది.

" ఒంట్లో బాగాలేదా ? .... పొద్దున చెప్పలేదేం మరి ఏదీ ! నాడి చూడనీ. ఎలా వుంది ఒంట్లో, ఒక్క నిమిషములో డాక్టర్ను పిల్చుకొస్తా " అంటూ హడావుడి చేస్తూ గుమ్మం వైపు దారి తీశాడు.

" అబ్బ ! డాక్టరు వద్దండి "

" డాక్టరు వద్దా !.... ఏం ? ఎందుకనీ ? "

" మీకెలా చెప్పాలో అర్థం కావడంలేదు "

" అర్థం కాకుంటే అన్నీ డాక్టరుకే చెప్పుదువుగానీ...."

" అబ్బ ! అది కాదండి, ఆమాత్రం అర్థం చేసుకోలేకపోతే ఎలా ! మొన్న వాకిటి ముందుకు నిమ్మకాయలొస్తే కొని పండ్లు పులిసేదాక తిన్నానా........ !

నిన్న మీరు కూరలకని మార్కెట్టుకు వెళుతుంటే కూరలతో పాటు మద్రాసు మామిడి కాయలు తెమ్మని చెప్పానా.... ! అప్పటికీ అర్థం చేసుకోలేక పోతే ఎలాగండి మీతో వేగటం "

" అంటే ! .... "

" మీరు తండ్రి కాబోతున్నారు " సిగ్గుతో మొఖాన్ని చేతుల మాటున దాచుకుంది.

" ఓ ! .... మైగాడ్ ! గుడ్‌న్యూస్ " అతని ఆనందానికి మేర లేదు.

" అనవసరంగా నన్ను హడల కొట్టేశావు పద్మా ! అయితే డాక్టరుతో పనిలేదంటావా ? "

" అక్కర్లేదండి ! మీరు బట్టలు విప్పండి. స్నానానికి నీళ్ళు తోడతా"

"నో ! నో ! అలాంటివేవీ పనికిరావ్. ఈరోజు నుండి, కాదు కాదు యీ క్షణం నుండి నా పనులన్నీ నేనే స్వయంగా చూచుకొంటాను. నీవు మాత్రం కదలవద్దు. పనిమనిషిని పెట్టుకొని పూర్తిగా రెస్టు తీసుకో. రేపు ఉదయం డాక్టరు వద్దకు వెళ్ళి కావలసిన టానిక్స్ వగైరాలు తెచ్చుకొందాం" అంటూ బట్టలు మార్చి బాత్‌రూం వైపు నడిచాడు. అతణ్ణి చూచి చిరునవ్వు నవ్వుకుంది.

"పద్మా ! యీ వేళ మన యింటి కెవరైనా నా కోసం వచ్చారా ?" ఒంటిమీద అక్కడక్కడ వున్న తడిని టవల్‌తో తుడుచుకుంటూ స్నానాల గది నుండి వస్తూ అడిగాడు.

"రాకపోవడం ఏమిటండి ఒకరి తరువాత ఒకరు వరుసగా రావడం ప్రారంభించారు....ఉసూరు మంటూ వెళ్ళిపోతుంటే పోనీలే పాపం అని పెరుక్కు అని తీసికొన్న పాలతో కాఫీ కల్పియిచ్చా....అయ్యగార్కి రేపు పెరుగు నిల్లు."

ప్రభాకర్ వదనం తన ఘనతకు వికశించింది.

"మీరెంత చెప్పకుండా వెళ్ళినా నాకంతా తెలిసిపోయింది. అయినా ఇదేం అన్యాయమండీ చిన్నపిల్లల్లాగా ఇంకా అందర్నీ ఏప్రిల్ ఫూల్స్‌ను చేయటాన్కి"

"చిన్న పిల్లవాణ్ణి గాక నేనేం పెద్ద వాణ్ణా ? మా అమ్మ నన్ను ఇంకా "ఒరేయ్ అబ్బాయీ" అని పిలుస్తుంటుంది. మనకు ఇది ఒక సరదా – హాబీ ! ప్రతి సంవత్సరం ఇలాగే అనేకమందిని అనేక రకాలుగా ఫూల్స్‌ని చేస్తా. నన్ను ఫూల్‌ను చెయ్యాలని అనేకమంది అనేక రకాలుగా ప్రయత్నం చేశారు. కానీ వాళ్ళ చేతకాలేదు. ఒక సంవత్సరం నాకు ఉద్యోగానికి ఇంటర్‌వ్యూ వచ్చింది. వెంటనే రమ్మని మా బాబాయి కొడుకు ఇదే టైముకు అందేటట్లుగా జాబు వ్రాస్తే నన్ను ఫూల్‌ను చేయటాన్కి రాశాడని వెళ్ళడం మానివేశాను. తీరా తర్వాత విచారిస్తే అది యదార్థం అని తేలింది. ఉద్యోగం పోయింది. యేం చేస్తాం. ఈ రోజంతా ఇదే ధ్యాసలో ఉంటాగదూ అందుకే వెనకాముందు చాలా జాగ్రత్తగా ఆలోచించి ప్రవర్తిస్తుంటాను." తన గొప్ప తనాన్ని చాటి చెప్పుకున్నాడు ప్రభాకర్.

"పాపం ! యారో మీ బుఱ్ఱ బాగా వేడెక్కి పుంటుంది. లేవండి పాపం. వడ్డిస్తాను భోంచేద్దురుగాని"

"అదిగో ! అదే పనికిరాదు. ఇందాకనే చెప్పానా నేను పూర్తిగా రెస్టు తీసికోమని"

అది మొదలు ప్రతి పని తనే చేసికోవడం మొదలు పెట్టాడు. పద్మను అడుగు క్రింద పెట్ట నివ్వలేదు. తనే అన్నం ముద్దలు కలిపి పద్మచేత తినిపించాడు "అదేమంటే" "అది అంతే" నంటాడు.

ఈ విధంగా భోజనాలు ముగించుకొని పడక గదిలోకి ప్రవేశించారు.

" అయితే పద్మా ! యీ విషయం నాతో ముందు చెప్పకుండా ఎందుకు దాచావ్ ? "

" ఛీ ! పొండి ! నా కసలే చచ్చే సిగ్గు.... ముందుగా చెప్తే ఇంతకన్నా ఎక్కువ ఏం చేస్తారు ? "

" ఏం చేసేవాడినా......... ! " అంటూ పద్మను తన బాహువుల్లో బంధించి గాఢంగా ఆలింగనం చేసికొన్నాడు.

" ఆగండాగండి ! మరీ అంత గట్టిగా అయితే ఎలా ? లోపల బాబు ఉక్కిరిబిక్కిరి అయిపోడూ ! "

" ఓ ! నిజమే ! మర్చిపోయాను సుమా ! " పట్టు వదలి మంచం మీద పడుకొంటూ మీదకు లాక్కున్నాడు.

" అబ్బాపుండండి ! ఎప్పటి లాగా మొరటుగా ఇలాంటి చిలిపిపనులు చేస్తే ఎలా " మంచం మీద పక్కనే కూర్చుంటూ అంది.

" అవునౌను ! ఇప్పుడు నిన్ను చాలా సున్నితంగా, మల్లెపువ్వులా చూచుకోవాలిగదూ ! "....

" చాల్లేండి మీ సరసాలు.........ఏమండీ ! మీకు అబ్బాయి కావాలా ? లేక అమ్మాయి కావాలా ? " గోముగా అతని జుట్టులోనికి వేళ్ళు పోనిచ్చి మృదువుగా నిమురుతూ అడిగింది.

పద్మ ముఖంపై పారాడుతున్న ముంగురులను సవరిస్తూ మిళ మిళ మంటూ కవ్వించే ఆమె కండ్లలోని సోయగాన్ని తిలకిస్తూ, ముత్యాల్లాగా మెరిసే ఆమె పండ్లను పదే పదేదాస్తున్న ఆమె లేత గులాబీ పెదవులపై చిటిక వేస్తూ....

" అమ్మ దొంగా నాచేత చెప్పించాలనా ! నన్నడిగి కడుపుతో వున్నావా నేనడిగిన బిడ్డ నివ్వటానికి. నీకెవరు ఇష్టమయితే నాకు వారే ఇష్టం "

" మా మంచి దొరవయసే దొరగారు గదూ మీరు అందుకని.... అందుకని.... చెప్పనా.... ? "

" చెప్పు మరి "

" మీలాంటి బంగారు బాబే కావాలి నాకు "

" నాకూ బాబంటేనే ఇష్టం "

" మరే ! .... మరి .... మీరు ప్రొద్దుటి నుండి యింటికి రాకపోతిరి. నాకు ఒక్క దానికి ఎలాగమ్మా ప్రొద్దుపోవడం.... అందుకని మనకు పుట్టబోయే బాబుకు ఒక చిన్న స్వెట్టర్ కుట్టటం ప్రారంభించాను. బాగుందో లేదో చూస్తారా మీరు ? "

" అలాగే ! చూపించు మరి "

" నవ్వకండేం మరి " అంటూ దిండు క్రింద నుండి ఒక చేతి గుడ్డ మడత విప్పార్చి చూపింది. దాని పైనున్న అక్షరాలు ప్రభాకర్ చదువుతూ "ఏ....ప్రి....ల్....ఫూల్ .... ఏమిటిది ? "నివ్వెరపోయి అడిగాడు. పద్మ కండ్లు మిల మిల మెరిశాయి.

" అయితే ఇందాకటి నుండి నీవు ఆడింది నాటక మన్న మాట "

" ఎందుకు కాకూడదు. మీ భార్యనేగా ! మీరు ముందు వెనక బాగా ఆలోచించి ప్రవర్తిస్తారు గదూ.... !

' నీవు నేర్పిన విద్యయే నీరజాక్షా '

అన్నారు పెద్దలు " గలగలమంటూ అతని హృదయం మీద వాలింది పద్మ.



# స్వీకారం

" చలం సాహిత్యావలోకనం "
రచన : ఎస్. ఎస్. లక్ష్మి, వెల : రు. 16_00
ప్రతులకు : టి, మాధవరావు, స్టీల్‌హౌస్,
కాంగ్రెస్ ఆఫీసురోడ్ విజయవాడ_2
స్పందన ప్రింటర్స్, మచిలీపట్నం_1.

" తత్త్వత్రయము " " నామ మహిమ "
వెల : రు. 10_00 వెల : రు. 6_00
రచన : శ్రీమాన్ నల్లాన్‌చక్రవర్తుల వెంకట నరశింహాచార్యులు, ప్రతులకు – శ్రీ గోదాగ్రంథమాల ముసునూరు_521 207, కృష్ణాజిల్లా.

" వి జ య జ్యో తి "
రచన : డా॥ ధనకుధరం లక్ష్మీనరశింహాచార్యులు,
వెల రు. 2_50 ప్రచురణ - శ్రీవాణి గ్రంథమాల,
తెనాలి, గుంటూరు జిల్లా.

" నా ఉ ద య ం " కవితా సంకలనం
రచన : నాగభైరవ కోటేశ్వరరావు, వెల : రు.6_(
ప్రభుత్వ స్త్రీల కళాశాల, చీరాల-523 155

" క ల లో క వి త "
రచన : రావి రంగారావు, వెల : రు. 5_00
ప్రతులకు : నరాల ప్రభావతి
25-364 బుట్టాయిపేట, మచిలీపట్నం.

" శి ల ల పొ ద లు " కవితా సంపుటి
రచన : ఆచార్య తిరుమల, వెల : 5-00
ప్రతులకు : ఆచార్య తిరుమల, చైతన్య కళాశాల
సుల్తాన్ బజార్, హైదరాబాద్-1

" దీప్తి " కవితా సంకలనం
వెల : రు. 8_00 ప్రతులకు_ఆంధ్ర సారస్వతసమితి
పి. బి. నెం. 51, మచిలీపట్నం-521 001

" కొ వ్వొ త్తి " కవితా సంపుటి
రచన : తిరునగరి, వెల : రు. 6_00
ప్రతులకు : తిరునగరి, కవితాసదన్, పోచమ్మవాడ
ఆలేరు పోస్టు (ఎస్ సి. రైల్వే) నల్గొండ జిల్లా.

" ఉదయించే సూర్యుడు " వచన కవిత
రచన : దేవులపల్లి శ్యాంసుందర్‌రావు వెల రు. 4/_
ప్రతులకు : తేజోప్రభ పబ్లికేషన్స్, సూర్యాపేట
దేవులపల్లి శ్యాంసుందర్‌రావు, చెర్వుబజార్,
హనుమాన్ గుడివద్ద, ఖమ్మం_507 001.

# ప్రియవేదిక

" కేవలం సాహిత్య మాసపత్రికగా కాకుండా సమగ్ర సాంస్కృతిక మాసపత్రికగా ' శ్రీవాణి ' ని రూపొందించ దలచు కున్న మీ సంకల్పం అభినందనీయం. ఇప్పటికి వెలువడ్డ సంచికలు ఇందుకు అనుగుణంగానే వున్నాయి. ' భారతి ' తరువాత ' శ్రీవాణి ' అంతటి స్థానాన్ని ఆక్రమించాలని మా ఆకాంక్ష "

–డా॥ వి. వి. యల్. నరసింహారావు, హైద్రాబాద్

" మీరు ఆదరంతో పంపిన ' శ్రీవాణి ' సంచికలు అందినాయి. మీ ప్రయత్నం విజయవంతం కావాలని ఆశిస్తున్నాను."

– ఆవుల సాంబశివరావు, హైద్రాబాద్

మార్చి సంచికలో మీ జోస్యం ఫలించింది. యన్. టి. ఆర్. కి ఖచ్చితంగా ఎన్ని సీట్లు వస్తాయని మీరు జోస్యం చెప్పారో ఖచ్చితంగా ( మిత్ర పక్షాలను కూడా కలుపుకుని ) అన్ని సీట్లు వచ్చాయి. త్రీ ఛీర్స్ టు యు.

–కె. ప్రభాకరరావు, చీరాల

" 1985 మార్చి సంచిక చాలా బాగున్నది. ముఖ చిత్రం ప్రజలను ఆకట్టుకునేట్లుగ వున్నది. "

– చెన్నగిరి హరినారాయణ, స్వతంత్రపురం

" సాంస్కృతిక మాసపత్రికగా ' శ్రీవాణి 'ని తీర్చి దిద్దేందుకు మీరు చేస్తున్న కృషికి అభినందనలు "

– ఆర్. యస్. సుదర్శనం, రాజమండ్రి

" వ్యాపార పత్రికలు మూడు పువ్వులూ, ఆరు కాయ లుగా విజృంభిస్తున్న కాలంలో, సాంస్కృతిక మాస పత్రికను స్థాపించడానికి ప్రయత్నించడం గొప్ప సాహసం. సంపాదకీయం చదివేక మీరు పోటీని తట్టుకో గలరనే అనిపిస్తున్నది. మీ నేతృత్వంలో యీ పత్రిక నిలదొక్కుకుని తెలుగు సాహిత్యానికి మీరు చేయగలిగిన దంతా చేయగలరనే ఆశిస్తున్నాను."

– కాశీపట్నం రామారావు, విశాఖపట్నం

' శ్రీ వా ణి అం ది న దా !

చందాదారు లందరికి 'శ్రీవాణి' ని సకాలంలో పోస్టులో పంపుతున్నాము. ప్రతి నెలా 22వ తేదీ లోపు పోస్టు అవుతున్నవి. కొంతమందికి అందటంలేదని లేఖలు వ్రాస్తు న్నారు. ఆ విధంగా వ్రాసిన వారందరికి మరల పోస్టులో పత్రికలను పంపుతున్నాము. అందనివారు స్థానిక పోస్టు ఆఫీసులో ఫిర్యాదు నిస్తూ ఆ కాపీ నకలును మాకు పంపి సహక రించండి. ధన్యవాదములు. మేనేజర్

భారతి పత్రికవలె శ్రీవాణి విశిష్టంగా వున్నది. సాహిత్య పరమైన వ్యాసాలు, మంచి కథలు, చక్కని సీరియల్ ఆద్యంతం బాగున్నది. వివేకానందస్వామి ముఖ చిత్రం ఫోటో కట్టించుకో దగినది. మహనీయుల సరసన మామూలు మనుషుల ఫొటోలను ఇకముందు ముద్రించ వద్దని మనవి చేయుచున్నాను.

– పవని నిర్మల ప్రభావతి, మొగలిచర్ల

"సాంస్కృతిక మాసపత్రిక నడపడం చాలా కష్టం. సాహసం చేస్తున్నందుకు నా అభినందనలు"

–డా॥ రామమోహనరాయ్, గుంటూరు

"స్వామి వివేకానంద ముఖచిత్రంతో ప్రచురించిన శ్రీవాణి హైలైట్. వారి ప్రక్కన యస్. టి. ఆర్. ఫొటో వేసి నా మనస్సును చాలా నొప్పించారు."

–యక్కల కుమారస్వామి, కప్పలదొడ్డి

"వివేకానంద ముఖచిత్రం చాలా బాగున్నది. 'యవనిక' సీరియల్ కూడా చాలా బాగుంది. 1, 2 సంచికల కంటే మూడవ సంచిక మంచిగా వున్నది"

–చవల సత్యనారాయణ, నందిగామ

# ఏకైక టోపీ

రాజకీయ నాయకుడు పెట్టేది గాంధీ టోపీ-
పోలీసువాడు పెట్టేది ఎర్రటోపి -
తిరపతి గుండు పెట్టేది బొచ్చుటోపీ -
మరి మావాడు పెట్టేదాన్నో ఇవేవీ చెయ్యాని
వీటన్నిటికి అది చేస్తుంది టాటీ— పోటో-

—ఆచార్య భావన్



# కైపి బెస్ట్లు

ఇవాళే పోస్టు చేసిన ఉత్తరం
పదినెల్లకందితే మహత్తరం -
అందాలంటే రెగ్యులర్‌గా లెటర్స్
ఉండాలి వాటికి తోకలు 'ఫ్యాన్స్'

—ఆచార్య భావన్



